# ఆంధ్రమహిళ

ఏప్రిల్, '60




**ANDHRA MAHILA**

**APRIL 1960**

*SIXTEENTH YEAR OF PUBLICATION*



శార్వరికి స్వాగతం

# మహిళా విద్యాలయము

## ఆంధ్ర మహిళా సభ

మార్చి నెలలో జరిగిన బెనారెస్ మెట్రిక్ పరీక్షకు 49, గురు, ఆంధ్ర మెట్రిక్ కు 11 గురు మద్రాసు మెట్రిక్ కు ఉస్మానియా యూనివర్సిటీ ప్రియూనివర్సిటీ పరీక్షలకు 8 గురు ఆంధ్ర మహిళా సభ విద్యార్థినులు హాజరైనారు. వీరి పరీక్షాఫలితాలు మే నెలలో ప్రకటింపబడుతాయి. మెట్రిక్ జూనియర్ తరగతులు తిరిగి జూన్ లో ప్రారంభమౌతాయి. జూనియర్ మెట్రిక్ తరగతికి వలయు స్టాండర్డు లేని విద్యార్థినుల సౌకర్యార్థం ఏప్రిల్ 15 నుంచి ప్రిపరేటరీ క్లాసులను నడుపుటకు నిశ్చయించాము. కనీసము థర్డు ఫారము స్టాండర్డైనా వున్న వారు యీ క్లాసులలో జేరవచ్చును. క్లాసు రుసుము మొదలగు వివరములు ఆంధ్ర మహిళా సభ కార్యదర్శిని (మైలాపూరు, మద్రాసు)కి వ్రాసి తెలుసుకొన వచ్చును.

బీద విద్యార్థినులకు వుచితభోజన వసతి సౌకర్యములు ఇవ్వబడును. కానివారు యిరవై యేళ్లకు పై బడిన వయోజనులై వుండాలి; మెట్రిక్యులేషను ప్యాసయిన పిదప కనీసము రెండు సంవత్సరాలైనా సెంట్రల్ సోషల్ వెల్ఫేరుబోర్డు వారు నిర్ణయించిన యే సంక్షేమ సంస్థకైనా సేవ చేస్తామని బాండు వ్రాసి యివ్వాలి. వివరములకు ఆంధ్ర మహిళా సభ కార్యదర్శినికి వ్రాయవచ్చును.

బట్టల నేతలో స్త్రీలకు తర్ఫీదునిచ్చుటకు, నేత పరిశ్రమ ద్వారా వారికి ఉపాధి కల్పించుటకు ఆంధ్ర మహిళా సభ పారిశ్రామిక విద్యాలయంలో 'హాండ్ లూమ్ యూనిట్'ను ప్రారంభిస్తున్నాము. ఈయూనిట్ లో జేరు బీద విద్యార్థినులకు నెలకు రూ 25 లు విద్యార్థి వేతనము యీయాబడును. ఈ అవకాశమును పొంద గోరువారు ఆంధ్ర మహిళా సభకు వ్రాసి వివరములను తెలుసుకొన వచ్చును.

ఆంధ్ర మహిళా సభ హైద్రాబాదు బ్రాంచిగూడ ఇ. యస్. యల్. సి. క్లాసులను నడుపుతోంది. బొమ్మలు తయారీ, లెదర్ వర్కు మొదలగు చేతిపనులలో శిక్షణ, బట్టల నేతలో తర్ఫీదుకు అవకాశములు కలుగజేస్తోంది. వివరములు వలయు గోరువారు ఆంధ్ర మహిళా సభ కార్యదర్శిని, బర్కత్ పురా, హైదరాబాదుకు వ్రాయవచ్చును.




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 16 :: ఏప్రిల్ '60 :: సంచిక 4

# శార్వరికి స్వాగతం

నేటి ఉగాదితో శార్వరి ఉదయించింది.

శార్వరీ! స్వాగతం. నీ చల్లని చూపులతో యింకో అధ్యాయం ప్రారంభమౌతోంది మా జీవితంలో. వికారిలో పుష్పించిన ఆశలు శార్వరిలో ఫలించి సౌభాగ్యాన్ని చేకూర్చుగాక!

శార్వరి ఎంత మంచిది, మన నడవడికి మెరుగు దిద్ది మన బాటకు ముగ్గుపెట్టి మన జీవితం తేజోమయం చేస్తుంది. మనిషికి మనిషికీ మధ్య, దేశానికి దేశానికీ మధ్య సౌహార్ద్రత పెంచి కుటుంబానికి, సంఘానికి, లోకానికి పచ్చతోరణం కడ్తుంది.

శార్వరిలో మన కుటుంబాలు పెద్ద వౌతాయట; కొత్త కోడళ్లు వచ్చి కొత్త శృంగారం తెచ్చిపెడ్తారట. పంచవర్ష ప్రణాళికల వల్ల ఆర్థికస్తోమతా పెరుగుతుంది కాబట్టి కుటుంబం పెరిగినా ఫరవాలేదట.

శార్వరిలో స్పర్థలకు స్వస్తి; కుటుంబంలోని అత్తా కోడళ్ల మధ్య, సంఘంలోని పార్టీల మధ్య, లోకంలోని దేశాల మధ్యా కమ్మటి కబుర్లే వినిపిస్తాయి, తియ్యటి తేనెలే వర్షిస్తాయట, పిల్లలని నానెత్తిమీద వదిలివెళ్ళింది అని కోపించదట యిక ముందావిడ; ఎంత మంచిది నాకోడలు సంసార భారం నెత్తినపడ్డా మొగుడు తెచ్చే పదికి పది చేరుద్దామని ఎంత తాపత్రయపడుతోంది అనుకుంటుందట అత్తగారు!

అధికారం జారిపోయిందే అన్నకించవున్నా ఎన్నికలలో ఓడినపార్టీలు కల్లకబుర్లు మాని నిర్మాణాత్మకంగా కృషిచేస్తాయట. శార్వరిలో, ప్రభుత్వం చేడిజిక్కినపార్టీ పొద్దు వున్నప్పుడే మూటసర్దుకో అనే వికృతన్యాయాన్ని పాటించక సమబుద్ధికలిగి ధర్మాన్నే పరిగణిస్తుందట.

చైనావాడు తనతప్పు తెలుసుకోడంవల్ల శార్వరిలో భారతి-చీనీ భాయిభాయి అనే నినాదాలుతిరిగి మిన్నుముట్టుతాయట! అమెరికా రష్యాలు వారి ఏటంబాంబులను సముద్రునికి స్వాహా యిచ్చి అనురాగ బాంధవ్యాన్ని నెలకొల్పుతారుట. ఈ భువిలో యిక ఆశ్రయం లేదని ఆకలి, స్పర్థ, యుద్ధం పాతాళానికడుగంటుతాయట.

ఓహో! శార్వరీ, ఎంత మంచిదానవమ్మా నువ్వు. స్వాగతం! సుస్వాగతం!

# సీతానగరాశ్రమము

## .... కొన్ని స్ఫురణలు

సీతానగరాశ్రమ మనగా ఆంధ్ర రాష్ట్రంలో, తూర్పు గోదావరి జిల్లా, సీతానగర మనే పల్లెలో, 1924 సంవత్సరంలో డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారిచే స్థాపించబడి, గాంధీగారి నిర్మాణ కార్యక్రమాంశాలన్నీ ఆచరించబడి స్వాతంత్ర్య పోరాటాలలో వేమగిరిస్థాయి నందుకొని, ఆంధ్రుల రాజకీయ పోరాటాల్లో నిర్మాణ యుక్తమైన ప్రముఖ స్థానాన్న లంకరించి, 1946 సం॥ నుండి గ్రామీణ సుసంఘటిత సంక్షేమానికి స్త్రీలకు గ్రామసేవికలు గానూ, ఉపాధ్యాయినులుగానూ, శిక్షణనిస్తూ, నిరాశ్రయులకు పెన్నిధిగానూ, బిడ్డలకు అమృతమాతగాను మేరు పర్వతమువలెకల్పవృక్షమై సానుభూతి విశ్వాస, అభిమాన ధనులగు సోదరీమణులకు వంశ మాతయై విరాజిల్లుచున్న మన కస్తూర్బాగాంధీ జాతీయ స్మారక నిధి సంస్థయేనని మనందరికీ తెలిసిన విషయమే. ఈ విషయాలన్నీ మనందరము యెన్నో లేఖల్లోనూ, పుస్తకాలలోనూ చదివాము. మనలో చాల మంది యీ రెండవ దశ పరిణామ కాలంలో కొద్ది సంవత్సరాలు ఆశ్రమంలో యుండి ఆ జీవితాన్ని అనుభవించి ప్రత్యక్షంగా వీక్షించిన సత్యాలే. అయినా నాభావాలతో మరలా వ్రాయుచున్నాను.

రుచిగావున్న పదార్థాన్ని మన మెప్పటికీ తినగోరి నట్లుగానే, బాగుంటుందని, నలుగురికీ చెప్పగలిగినట్లే చరిత్రగల యే సంస్థనైనా, అందులో మన జీవితపు బాటలను తీర్చిదిద్దిన సంస్థను యెప్పటికీ మరువలేము. దాన్ని దశదిశలా ప్రతిబింబింప జేసికోవడానికే మన ఆత్మ వుబలాట పడుతుంటుంది. అయితే నాస్మృతిలో ఆపవిత్ర సంస్థలో నాకు గోచరించిన ప్రతి సంఘటననూ మనస్సా చిత్రించి, వూహాలకు రూపకల్పన చేయుటలో పొరపాటు, అపసవ్యత వుండదనుకుంటాను.

అవి, నాజీవిత వ్యక్తిత్వపుఅస్తవ్యస్త తొలిదినాలు. అంతేకాదు. నాస్వతంత్ర జీవితానికి తొలిమెట్టులో ప్రకృతి పలికిన నాంది ప్రస్తావన. అది 1946 సం॥ మే మాసం. ఒకరోజు ఆకతాయిగా ఆంధ్రప్రభ దినపత్రిక తీసిచూశాను. రెండవపేజీ మొదటికాలంలో చివరలో అడుగునబడిన "కస్తూర్బానిధితరుపున దుర్గాబాయమ్మగారి ఆధిపత్యంలో '' సీతానగరంలో రాట్నం ట్రైనింగ్" అన్న ప్రకటన చూచి, అభోదానందంతో ఒక పెద్దకు చూపించాను. బాగుందనుకున్నాము. ఆ పెద్దను గార్డియనుగా బట్టి దుర్గాబాయమ్మగారితో జరుపవలసిన పత్రవ్యవహారమంతా జరిపాము. సీతానగరంకు ప్రయాణ వివరాలు, వెంటతెచ్చుకోవలసిన సామానులతో సహా 6 6-1946కు ఆశ్రమంలో చేరిపోవలసిందిగా ఒక సెలెక్టెడ్ కార్డు వేశారు. ఆరాత్రంతటితో సహా, ఆరోజు వుదయం 5 గంటలకు గోదావరి స్టేషనులో రైలు దిగేసరికి పరిణమించిన జీవితానికి ఘనీభవించిన భవిష్యత్తాన్నట్లు - రోకటిధారగా వర్షం పడింది. నాకు అంతకు ముందెప్పుడూ గోదావరి నది ఆప్రాంతమును చూచిన, చెప్పుకొనగా విన్నగమనం లేదు. అయితే నాగార్డియనుకు ఆ ప్రాంతమంతా పరిచయమైనదగుటచే, వుదయం 7 గంటలకు సీతానగరం

యస్. యన్. బేగం

బయలుదేరే లాంచీలో నన్ను కూర్చోబెట్టి, నాకు టిఫిన్ తెద్దామని అలా వెల్కం హోటలుదాకా వెళ్ళారో లేదో, యింతలో నేను కూర్చున్న లాంచి బయలుదేరింది. బయలుదేరితే అది వెనుదిరుగుతుందా, ఆగుతుందా, లేదు. అయోమయావస్థలో గాని, అజ్ఞాన దశలోగాని, బాల్యంలోగాని మంచీ చెడూ తెలియదు, భయం వుండదంటారు. ఇంచుమించు యోచించే హృదయం కూడా వుండవనే సత్యాలలో యేదో నన్నుకూడ ఆవరించి, అయ్యో గార్డియను వచ్చేదాక వుండాలి, మాట్లాడాలి, ఫలహారం చెయ్యాలి, లేకుంటే ఆకలేస్తుందేమోనన్న యోచనైనా లేకుండా, అయ్యో యీ లాంచీ పోతే మరి దొరకదుకాబోలనుకొని అందులోనే యుండిపోయాను. నేనెక్కిన లాంచి దరినివిడిచి 3 ఫర్లాంగుల దూరం వెళ్ళాక గార్డియనొచ్చి కేకవేశారు. నేనూ చేతులూపాను. కాని ప్రయోజనంలేకపోయింది. మా కేకలలోనే లాంచీ బ్రిడ్జిదాటిపోయింది, దూరమయిపోయాం. లాంచీలో మాట్లాడించి చూస్తే నాతో పాటు ఆశ్రమంలో చేరుటకు వచ్చే ఒక్క విద్యార్థినీ అందులోలేరు.

## లాంచీ ప్రయాణం

ఆ సంవత్సరంకూడా యీ సంవత్సరంవలె సకాల వర్షాలుండుట వలనగాబోలు గోదావరి నిండుగ నీరున్నది. అంతనీటిలో లాంచీ ప్రయాణానికి యిప్పుడు భయపడతానేమోగాని అప్పుడు భయపడలేదు. రాజమండ్రి సీతానగరం మధ్యలో గల ప్రయాణ రేవులన్నిటిలోకి లాంచీ తిరుగుతుంటె, నీటితుంపరలను పట్టుకొంటూ. చేతులతో నీళ్లు చిమ్ముకొంటూ అదొక ఆటగా యుండేది. మధ్యాహ్నం 12 గంటలకుగాని లాంచి సీతానగరంరేవు చేరేదికాదు. ఎండెక్కువగుతున్నకొద్దీ, ఆకలెక్కువ, ఆ ఆశ్రమం తలంపు. లాంచీ ఆగేరేవు స్థలాలలో యెక్కడాయిండ్లు కనబడకపోగా లాంచీలో కూర్చొని వెళ్లుతున్నకొద్దీ చూస్తుంటే 3 అడుగులు మొదలు తాడి ప్రమాణం గోదావరిగట్టే గాని యింకేదీ కనబడేదికాదు. అంతకుముందు ఆశ్రమాలు, జాతీయత అనేవి తెలియనందున గాబోలు, యీ గోదావరి గట్లే యింత యెత్తునున్నాయి ఆశ్రమం అంటే యింకా యెంతో దూరంలో ఒక అడవిలాంటి ప్రదేశంలో వుంటుంది. గాబోలు, పెద్ద యెడారిప్రదేశమై యుండవచ్చు అక్కడ యెలాంటి జీవితం చెప్మా అనుకొనేదాన్ని ఇంతలో సీతానగరం రేవు వచ్చింది. అందరితోపాటు నేనూ లాంచీ దిగాను. ఎద్దుల బండెక్కి ఆశ్రమానికి చేరుకోవాలి, ఇక్కడికి రెండు మైళ్ళలో వూరుముందు మరొక యేటి గట్టుండుటవలన యెంతకీ యిండ్లు కనబడవు. తర్వాత సీతానగరం స్లోపుదిగి వంకర టింకర పుంతల్లోంచి బండిపోతుంటే, ఆశ్రమం తప్పక చాలా దూరంలో వుందను కున్నాను.

## ప్రారంభం, వుత్సవం

పుంతల్లో 4 ఫర్లాంగుల్లో బండి ఆశ్రమపు ప్రధాన గేటుదాటింది. దాటిన 10 గజాల దూరంలో బండి ఆగింది బండిదిగి ఒక్కసారి కోలాహలంతో కలకలలాడుతున్న సుమారు 450 గజాల వృత్తాన్ని కలియజూచాను. ఇది అడవికాదు, చాల మందుంటారు. బాగా ఆడుకోవచ్చుననుకొని సంతోషించాను. ఇంతలో చిరకాల ఆశ్రమ వాసులగు పెద్దలు, వుపాధ్యాయినీ వర్గమని చెప్పుకోబడే మా మాతృ సమానుల్లో ఒకరైన కంభంమెట్టు కమలమ్మగారు వచ్చి, యేవూరు, యేంపేరు, శిక్షణకే వచ్చారా, అన్న ప్రశ్నలకు సరైన సమాధానాలు పొంది నన్నాదరించారు. అప్పుడు వర్షాలుపడుతున్న జూన్ మాసమయినా మంచి మామిడిపండ్ల కాలం. ఆవెంటనే స్నానం, భోజనం అయింది. సామాను పెట్టుకోవడానికి గది యిచ్చారు. ఆ పూటనుండే కమలమ్మగారు నన్ను వెంటేసుకొని అన్నీ చూపెట్టారు బాగా మాట్లాడారు. అంటే రాబోయే క్రొత్త విద్యార్థినులకు ఒక విధంగా మా నేటరుగా తయారుచేశారు. అందరితోపాటు నేను కూడా యేవో పనులున్నట్లు హడావిడిగా తిరుగుట మొదలు పెట్టాను, ఆశ్రమంలో ఝండా వందనస్థలానికి కర్రలు కట్టుట సున్నాలువేసేవారు, దారులు చెక్కేవారు, నీళ్లు మోసేవాళ్ళు, పప్పులు బియ్యాలు బాగుచేసేవారు చాల హడావిడిగా, వుషారుగా పనులు చేస్తుండేవారు, ఆ కార్యక్రమమంతా తలంచుకొంటే, భారత స్వాతంత్ర్యానికి ముందు ప్రథమ సమారోహ వుత్సవాలు గాబోలనిపిస్తుంది. ఆరోజు సాయంత్రం 5 గంటలకు దుర్గాబాయమ్మగారు, మిగతా వుపాధ్యాయినులు, కొందరు విద్యార్థినులు చేరారు. 9-6-1946 శిక్షణ కేంద్ర ప్రారంభ దినము. ఆ నాటికి అప్పటి మన మదరాసు రాష్ట్రంలోని పెద్దలైన స్త్రీ పురుషులు, మంత్రివర్యులు, వివిధ సంస్థల ప్రతినిధులు

చాల మంది వచ్చారు. ఆచుట్టుప్రక్కల గ్రామ ప్రజలందరూ వచ్చారు. చిన్నలు, పెద్దలు అట్టలమీద యేవేవో నినాద వాక్యాలతో సగౌరవంగా సమావేశమయినారు. ప్రారంభోత్సవాలు రెండు రోజులు జరిపారు. ఆనాటి ఆ పెద్దల వుపన్యాససారాంశాలు అట్టలమీద నినాదాలు యేమిటో తెలియవుగాని ఆ దృశ్యాలన్నీ మాత్రం యీ నాటికి చిరస్మృతులుగా కను సన్నలలో మెదులుతుంటాయి. మన బా కస్తూరిబాయి గాంధీ అంతకుముందెప్పుడో అంతకు ముందు రెండు మూడుమారులు ఆశ్రమానికి వచ్చినప్పుడు ఆమె ప్రసంగాలు చేసిన స్థలమట, అందువలన ఆ రెండు రోజులలో కూడా ఆశ్రమంలో వున్న ఆ మూడు నేరేడుచెట్లకు పడమరదిక్కున వెనుక భాగంలో వేదిక యేర్పాటుచేశారు.

## శిక్షణ ప్రారంభం

10-6-1946 వుదయం, 8 గంటల నుండి ప్రారంభం. మాకు ప్రథమ వుపాధ్యాయిని శ్రీమతి దుర్గాబాయమ్మగారే. మొదట ఝండా వందనం చేయించారు. తర్వాత అక్కడే కూర్చోబెట్టి, తకలీలు అవి త్రిప్పుకోడానికి కాగితాలు యిచ్చి అవి త్రిప్పే విధానం చూపించారు. మేము తకలీలు త్రిప్పుకొంటుంటే ఆమె, మా అందరికీ యేవేవో విషయాలు చెబుతుండేవారు. ఈ విధంగా రెండు పూటలా తకలీలు త్రిప్పించుటతోపాటు వివిధ విషయాల బోధన, సాయంత్రం 7 గంటలకు ప్రార్థనానంతరం, విద్యార్థినులను మంత్రిణులుగా నియోగించి, బాధ్యతా నిర్వహణల గురించి చెప్తుండేవారు. నీవు హుషారుగా వున్నావు, నీవు ఆర్థిక మంత్రిగా వుండు, చాల జాగ్రత్తగా బాధ్యత నిర్వహించుకోవాలి, మంచి బియ్యం, పప్పు, చింతపండు అన్నీ తెప్పించుకోవాలి అని నాకు చెప్పినట్లు బాగా గుర్తు. ఈవిధంగా మాతోపాటు 10 రోజులుండి వివిధ కార్యక్రమాల పరిచయంచేసి వెళ్ళిపోయినారు. ఆ తర్వాత వారు యెప్పుడు వచ్చినా, యివ్వనిసందేశం, వినిపించని విజ్ఞానబోధ, కలిగించని ఆవేశం వుండేదేకాదు. ఫిలిపించని వేత్తలేవుండేవారు కాదు. వేళకు మాతృహృదయం బిడ్డపై మరులుగొన్నట్లుగానూ, కుటుంబ యజమాని పైగ్రామానికి వెళ్ళినప్పుడు, యిల్లు గురించి ఆలోచించినట్లుగానూ దుర్గాబాయమ్మగారు రాజమండ్రి సమీపానికి యెప్పుడు వచ్చినా సరే ఒక పూటలేక ఒక గంట కొంతైనా ఆశ్రమానికి వచ్చి, అందరి యోగక్షేమాలు కనుక్కొని యేమైనా సందేశాలు యిచ్చివెళ్తుండేవారు. ఆమె యెప్పుడు వుపన్యాసమిచ్చినా, యిప్పుడేదైనా కార్యరంగం వుంటే వెళ్లిచూకుదామా అన్నంత ఆవేశం కలిగించేదిగా వుండేది. ఆ రెండు సంవత్సరాలలో జరిగిన ప్రతి కార్యక్రమానికి దుర్గాబాయమ్మగారు యెక్కడున్నా ఆశ్రమానికి వచ్చివెళ్లేవారు. ఇక ఆతర్వాత మేమూ, మా మాతృసమానులు కార్యోన్ముఖుల మయాం, దుర్గాబాయమ్మగారు కార్య భారాలవల్ల పెద్దవారై పోయారు. ఇక శిక్షణలో మేము నేర్చుకొన్న పని, శాస్త్రమూ, అంతా స్వావలంబన యుక్తమైనదే. ఏదో 6 నెలల ట్రైనింగ్‌కు వచ్చాము తర్వాత పోతాము వీళ్ళెవరో, మేమెవరమో అన్న భావన మాలో యేనాడూ కలుగలేదు. మా మాతృ సమానులు మాపెట్టిన ప్రేమ సౌహార్ద్రాలు చిరస్థాయిగా మా జీవితాలను పెనవేసికొని పోయినాయి. ప్రతి సంవత్సరం కస్తూర్బా వర్ధంతికి ఆమె పేరున పేద విద్యార్థినులకు 3 చీరెలు దానం చేశేవారు. అట్టి వాటిలో నేను కూడా ఒక సంవత్సరం పేద విద్యార్థినిగా ఒక చీరెను కూడా పొందాను. అప్పటి పరిస్థితిని బట్టి 6 నెలలన్న ట్రైనింగ్ 18 మాసాలు పెంచినా శిక్షణానంతరం ఆశ్రమం విడిచిపెట్టి వెళ్ళాలనేసరికి, యింత త్వరగానా అనిపించేది. అప్పట్లో దుర్గాబాయమ్మగారు కస్తూర్బానిధి ఏజంటు (ఆంధ్ర)గానూ శ్రీమతి దుల్ల విద్యాదేవిగారు కేంద్ర ప్రిన్సిపాల్‌గాను వుండేవారు. ఇప్పుడు దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారు కేంద్ర సంచాలికగా యున్నారు. తర్వాత 1948 జనవరిలో మతుకుమల్లి విజయలక్ష్మిగారు ఎం.బి.బి.ఎస్. డాక్టరుగా కస్తూర్బా ప్రసూతి శాఖ ప్రారంభించుటతో మాది సర్వాంగ సంస్థగా రూపొందింది. అక్కడ మేము పొందింది ఒక్క రాట్నం ట్రైనింగే కాదు. స్త్రీ నాగరికురాలుగానూ, సమర్థవంతురాలుగానూ, చరిత్రవంతురాలుగానూ, జ్ఞానిగాను తయారు కాగల శిక్షణలన్నీ పొందాము. ఆ దీపికే యీనాటి మా వెలుగు, బిడ్డకు తల్లి గృహంలో యివ్వవలసిన శిక్షణలాగా మాచేత ప్రతి పండుగనూ, పర్వదినము జరిపించేవారు. అట్లతద్ది మొదలగు పండుగలకు తెల్లవారుఝామున లేచి వుల్లిపాయ పులుసు, గోంగూర పచ్చడి, పెరుగులతో భోంచేసి, విద్యార్థినులము,

మాతృసమాసులము కలసి ఆడుకొన్న దినాలు. టంగుటూరి శ్రీ ప్రకాశం పంతులుగారు, క్రొవ్విడి లింగరాజుగారు, బులుసు సాంబమూర్తిగారు వుపన్యాసాలలో వినిపించిన, వుద్రేకపూరిత స్వాతంత్ర్య పోరాటాల సింహగర్జనల అమృత ఘడియలను, 1947 ఆగష్టు 15 వ తేదీ రాత్రి 12 గంటలకు మనము పొందిన స్వాతంత్ర్య దిన సందర్భమున, ఆశ్రమ శిక్షణలోచేరి ఆస్వాతంత్ర్యాన్ని మేమేతెచ్చామా అన్నట్లు తన్మయతతో ఆశ్రమమంతటా పిచ్చినన్ని రకాలుగా దీపావళులను పేల్చి, ముఖ్యంగా ఝండా వందన ప్రాంతమంతా, కొద్ది ఘడియలలో, యీ దీపతోరణాలన్నీ ఆకాశాన్నే అంటబోతున్నాయన్నట్లు పేల్చి, ఆసమయానికి 12 గంటలు కొట్టి చిరంతనానందంతో మూడు రంగుల మన జాతీయ ఝండాను ఆకాశ వీధిలో యెగురవేసిన ఆవెలలేని అమృత ఘడియలను, ప్రతి కార్యక్రమానికి పెల్లుబికిన ప్రజావాహినులను యేనాటికీ మరువలేను. ఏకార్యక్రమానికైనా ఆగ్రామాల ప్రజల సహకారం సౌమ్యత యెంతకైనా విలువకట్టలేము. మాతో 10 మాసాలు వుండి తర్వాత మంత్రసాని శిక్షణకొఱకు బొబ్బిలి ఘోషాస్పత్రికి వెళ్లిన సోదరీమణులను, యేవేవో కారణాలతో ఆశ్రమం విడిచిపెట్టిన సోదరీమణులను, కేంద్రాధికారులచే నిరసించబడి బయటికి పంపబడిన సోదరీమణులను, కారణం యీనాటికీ తెలియదుగాని, లాంచీ ప్రయాణంలో బట్టలన్నీ తడుపుకొని ప్రారంభం నాడే వచ్చిన తిమ్మాబాయమ్మను, 2 రోజుల తర్వాత 'ఎలూరునుండి వచ్చిన జయలక్ష్మి, 4 రోజుల తర్వాత ఆశ్రమం విడిచి మద్రాసు ఆంధ్రమహిళా సభకు వెళ్లిన వారిద్దరినీ కూడా మరువలేము. నేను ఆశ్రమంలో శిక్షణ పొందిన 18 మాసాలు వివిధ జిల్లాలలోనే కాకుండా ఆశ్రమంలో పనిచేసిన మూడు సంవత్సరాల కాలం మొత్తం 6 సంవత్సరాలలోనే, వివిధ సాధన, సామాగ్రులతో బుట్టలో సంసారం తట్టతో సాగిస్తున్నంత అభివృద్ధయింది. ఇప్పుడా తట్టలో సంసారంగా దేదాకావచ్చింది. ఇంకా మనం మన సంస్థయొక్క వుజ్వల భవిష్యత్తును చూడగలగాలి. పాలకోడేటి రమణాదేవిగారి సంపాద కత్వాన 'గ్రామసేవిక' అనే వ్రాత పత్రికను కూడా ప్రారంభించుకొన్నాము. ఏదైనా ఫంక్షనువస్తే పనులు చేసికోవడానికి రాత్రింబవళ్ళు చాలేవిగాదు. అలా చేసినా అలసటుండేదిగాదు. సమయం చాలేదికాదు. చుట్టుప్రక్కల గ్రామాలకు ఝండాలతో తిరిగిన యేడెనిమిది మైళ్ళచదరపు మైళ్ళ ప్రభాతభేరీలు మరువము. ఆశ్రమానికి భౌతికంగా యెన్నో మార్పులు జరిగాయి. కంట్రోలు రోజుల్లోనైనా (ఆహార పదార్థాల) మా మాతృమూర్తులు అర్థాకలంటే యేమిటో మాకు తెలియనివ్వలేదు. అంత పుష్కలంగా సరఫరా చేయించేవారు.

## ఆశ్రమ భౌతికత

ఆశ్రమ అవరణమొత్తం సుమారు 4½ యకరాల వైశాల్యముంటుంది. ఆశ్రమం గోదావరియేటిగట్టుకు తూర్పుదిక్కుగా అనుకొనే 3 గజాల పుంత వెడల్పులో అనుకొని యుంటుంది. ఆశ్రమంచుట్టూ, నాగజెముడు, బొమ్మజెముడు, సీమచింత, చింత తాటి చెట్లతో పెట్టనిగోడలుగా తాడిప్రమాణంలో యుంటాయి. ఆశ్రమానికి నాలుగు ప్రక్కలా పుంతలే. ఆశ్రమానికి తూర్పు, వుత్తర పుంతలకు రెండవప్రక్కన యిండ్లుంటాయి. తూర్పు ప్రక్కన ఏటిగట్టు, దక్షిణ పుంతకు రెండవ ప్రక్కన, మామిడి జీడితోటలుంటాయి. ఆశ్రమానికి పడమర దిక్కుగావున్న యినుప చువ్వల (గజాల) గేటే ప్రధమప్రాంగణము. తూర్పున మరొక పెద్దగేటు. ఉత్తరమున మరొక చిన్న తిరుగుడుగేటు. ఆ తిరుగుడుగేటులో యిద్దరిద్దరి చొప్పున నిలబడి ఆడుకొనేవారము కూడాను. ప్రధమాంగణం దాటి 10 గజాలు వెళ్ళినతర్వాత యెడమవైపున మొదటి యిల్లువిడిచి, రెండవయింటికి సేవాభవన్ అని, ఆ ప్రక్కగా ఖాదీభండారుకు లీలాభవన్ అని ఆ ప్రక్కదానికి ఆఫీసని, ఆ ప్రక్కదానికి సాహిత్య కుటీర్ అని దానిప్రక్క దానికి క్రాఫ్టురూమని దాని ప్రక్కనున్న దానికి వార్డని దాని ప్రక్క దానికి సంగీత నిలయమని (ఇప్పటి లేబర్‌రూము) దాని ప్రక్కదానికి క్లాసురూమని (ఇప్పుడు డాక్టర్ గారి యిల్లు) ఆ ప్రక్కదానికి విజయాభవన్ అని ఆ ప్రక్కదానికి కళాభవన్ అని. దాని ప్రక్కదానికి సరస్వతీ భవన్ అని మేము పెట్టుకొన్న పేర్లే. జాతీయంగా ఆశ్రమం మా కుటుంబంఅన్న దానికి తగినట్లుగానే స్త్రీ యొక్క బాల్యంనుండి వివిధ పరిణామదశలతో వృద్ధాప్యాన్నికూడా ఆశ్రమంలో చూచాము. మరణాలనుకూడా చూచాము. ఇవన్నీ ఒకే వ్యక్తిలో అనికాదు. విషసర్పాలుకరచిన యిద్దరి సోదరీమణులనుకూడా బ్రతికించుకొన్నాము.

ఆశ్రమ ప్రాంగణంలో అడుగుపెట్టగానే తొలి చూపులో కనబడుతుంది. ఆశ్రమ స్థాపకులైన శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారి విగ్రహం, మలి చూపులో కనబడుతుంది జీవులపాలనచి, సర్వ మతసార, సమజ్ఞాన చర్చా ప్రార్థనావేదికీ, అగ్రమంలో యెక్కడచూచి పచ్చగా కనులకింపుగా వుంటుంది అనువైన గాళీస్థలాలో మణుగులకొలది కూరలు పండించుకోనేవాళ్ళము నుయ్యిచుట్టూ అరటితోట పెంచుకొన్నాము ఝండావందనచౌకులోపలస్తంభానికి పడమరగా రెండువైపులా గుమ్ముగా పెరిగియున్న రెండుపుష్పవృక్షాలు నేను మాస్నేహితురాలు వేసికొన్నవే విజయాభవనం వెనుక మగ్గాలశాలలో పైకియెగగట్టిన పట్టు మగ్గాలను చూస్తుంటే, "నారాయణరావు" నవలలోని సీతానగరం పట్టునేతంతా జ్ఞాపకమొస్తుంది నవారు ప్రిబేసిక్ తరగుతులు జరిపిన రెండు పర్ణశాలలేయీనాటి భోజనశాల, ఆశ్రమానికి దక్షిణభాగంలో చివరన బేసిక్ తరగతులు జరిగే గాంధీగారి పాకనుచూస్తూంటే అక్కడిప్రశాంతతకు, దాని యేకాంతానికి తగిన నామకరణం చేశారనిపిస్తుంది మగ్గాలశాల వద్దవున్న మూడు నేరేడు చెట్లుచూడండి ఆశ్రమ పుట్టక, పరిణితి, అభివృద్ధి అంతాచూసి యింతవృద్ధుల మయామము యింకా, కూడా ఆశ్రమ దశలను చూడడానికి మాలో ఓపికుంది మమ్మల్నిలాగే కాలక్షేపంచెయ్యనియ్యండని కోరుతూ, సవినయంగా ప్రార్థిస్తూ తలలువంచుకొని కనబడతాయి సుబ్రహ్మణ్యంగారి విగ్రహానికి వనుక ప్రక్క, దూర్పుగా ముఖంచేసి కుడిచేతిప్రక్కకు 1100 డిగ్రీల కోణంలోచూస్తే, కరగిపోతున్న అలనాటి అస్పత్రిగోడలు కనిపిస్తాయి వాటిని గమనించితే భారత స్వాతంత్ర్య పోరాటంలో మేమూ మా భాగంగా సర్వశక్తులూ అర్పించి యీనాటికిలా జీవచ్ఛల్లావున్నామని చెబుతున్నట్లనిపిస్తుంద వాటి ప్రక్కనేవున్న రోగుల వార్డులోనికి 4 అడుగులు వెయ్యండి ఎదురుగా గోడకు ఆశ్రమ స్థాపకము ఖ్యల్లో ఒకరైన శ్రీ లక్ష్మీపతిగారి పెద్దఫోటో కనబడుతుంది "బ్రిటిష్ రాజుల జులుంరోజులో ఒక రోజు వుషఃకాలమున నేను నాగు పాముకాటుకు బలైనా, నా ఆత్మనిరంతరం ఆశ్రమ భవిష్యత్తునుగురించే యోచిస్తుందని చెబుతున్నట్లనిపిస్తుంది వార్డుకు క్రాస్టుహాముకుమధ్యగా తూర్పు గేటువరకూవున్న అశోక, గొగడ, మామిడి, చింతచెట్లనుచూడండి. ఆ రెండువరసలచెట్టూ, మేముదేవప్రసాదితులం యెన్ని తరములుమారినా, ఆశ్రమానికి అందంచేకూర్చడంలో మా క్రమశిక్షణను తెలుపు కోవడంలోనూ, ఫలించడంలోనూ మా ధర్మాన్ని మేము మానం, మాతృస్థానమే మన సంస్థది కూడాను, కస్తూర్బా సంస్థ, గౌతమీ సత్యాగ్రహాశ్రమము యివి రెండూవిడదీయరాని ఘన సమ్మేళనములు ఇందు యేదిలేకపోయినా రెండదానికి వెలితే, ఆశ్రమం, సంస్థమనది. మాది, మేమందరం ఆశ్రమవంశీకులము మన తర్వాత వాళ్ళకు కూడా సంస్థ మనదే జాతీయంగా మనది. మాదఅన్న శబ్దానికి బహు విశాలమైన భావంవుంది. ఆవిశాల భావాలలో మనమూ చిన్నచిన్న అంశాలమే ఆ సంస్థపట్ల భక్తి విశ్వాసం కలిగినప్పుడూ నమమూ అందులోని అణువులమే మెదడుకు తగిన ఆలోచన. భావాలకు తగిన భాష, భాషకు తగినపదజాలంనాలో లేనప్పుడు, చేతనయినదీ చూపగలిగిందీ మూకభక్తే అయితే జీవితంలో, విశ్వాసగుచ్ఛమె నాది, మాది అన్న జాతీయ సంస్థకు చూపెట్టవలసిన పూర్ణపుష్పమని కూడా నమ్ముతాను విశ్వాస గుచ్ఛాలతో మన సంస్థ పూజింపబడుచూ ఆదర్శ క్రియారూప స్తోత్రాత్రుత్వములతో మన సంస్థ వర్ధిల్లి స్త్రీజాతికే వెన్నెముకగా వెలయుగాక !

---



# పసిపాపా !

'కిన్నెర'

కిలకిలానవ్వే
ఓ ! బోసినోటి పసిపాపా !
గాంచుచున్నాను
నీ మృదు మధురాకారంలో
దివ్యతేజఃపుంజమును !

ఉన్నది ఏదో
మహత్తర భావం
నీ బోసినోటినుండి
వెల్వడు చిరునవ్వులో.

గోచరించును
నీ కేరింతాల ఖేలనములో
దివ్యలీలల తత్వం.

"అమ్మా" అను నీ పిలుపులో
పవిత్రతను నే తెలుపలేను
యవనికాంతరమునుండి
ఈ అనంత విశ్వాన్ని
తిలకించే
దివ్య సుందరమూర్తి
మున్నెన్నడో నీవలెనే
తన ఆటపాటలతో
మాతృ హృదయాన్ని
పులకింపజేసె కదా?

(విలియం బ్లేక్ ఆధారంగా)

# పరివర్తన

మూలం :
ప్రేమ్‌చంద్

స్వేచ్ఛానువాదం :
ఏ. యస్. రామారావు.

ఈ మధ్య కొన్ని సంవత్సరాల్నుంచీ సుజన్ భూములు బంగారాన్నే పండిస్తున్నాయి ఇలాంటి భూములు ఈ చుట్టుప్రక్కలగ్రామాల్లోఎక్కడాకానరావు సుజన్ చేతుల్లో ఇప్పుడు డబ్బుపుష్కలంగా ఆడుతోంది. సుజన్ ఆడబ్బు నంతా దానధర్మాల్లోనూ, భగవత్కార్యాల్లోనూ మంచి నీళ్ళప్రాయంలా ఖర్చుచెయ్యటం మొదలెట్టేడు అతని ఇల్లు ఒక దేవస్థానంలా తయారయింది. పెద్ద పెద్ద ఆఫీసర్లదగ్గర్నుంచీ, కటిక పేదలవరకూ సుజన్ ఇంటికివస్తూ, అతనిచ్చే ఆతిథ్యాన్నిస్వీకరిస్తూన్నారు. వచ్చేపోయే వాళ్ళంతా సుజన్ అదృష్టాన్నికీర్తిస్తూ మరీపోతున్నారు. అదృష్టం కాకపోతేమరేమిటి ? కాలంకాని కాలంలో, ఈ మధ్య అతని ఆవులన్నీ అధికంగాపాలనిస్తున్నాయి. అయినాసరే, వాటిలో సుజన్ తనకోసం ఒక చుక్క కూడా ముట్టుకోవడంలేదు. కష్టించిపనిచేసే రైతుకు సాధారణంగాపాలతో అవసరంవుండదు ఏదో ఇంత సంగటిముద్ద, నంజుకోటానికి కమ్మనికూరావుంటే చాలు తన జీవితాన్ని గడిపేస్తాడు !

సుజన్ పుట్టుకతోనే చాలా నెమ్మదస్తుడు. అందర్నీ గౌరవిస్తాడు. ఎవరైనా బాధపడుతూంటే తనే బాధపడుతున్నట్లుగాబాధపడతాడు సుజన్. తక్షణంసహాయంచేస్తేనే కాని అతని హృదయానికి సంతృప్తికలగదు.

ఒకసారి ఆవూళ్లో నూతులన్నీ ఎండకుఎండిపోయేయి పొలాలకు నీళ్ళుకరువయ్యాయి ప్రజల్లోకలవరం బయలుదేరింది. భవిష్యంగురించి అంతా భీతిచెందారు. అప్పుడు సుజన్ స్వంతఖర్చుతోవున్న నూతుల్ని బాగుచేయించటమే కాకుండా, క్రొత్తగాఎన్నో నూతుల్నిత్రవ్వించి తోటి వ్యవసాయదార్లకి సహాయంచేసేడు. దాంతో సుజన్ అంటే ఆవూళ్ళో అందరికీ దేవుడైపోయేడు అందరి అభిమానానికీ పాత్రుడయ్యేడు.

ఒకనాడు గయవెళ్తూ కొందరు యాత్రికులు సుజన్ ఇంట్లోబసచేసేరు ఎన్నాళ్ళనుంచో తనూ గయవెళ్ళాలనుకుంటున్న సుజన్, వాళ్ళందర్నీచూసి వాళ్ళతోపాటు తనూ గయవెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు. వెంటనే ప్రయాణానికి సర్వం సిద్ధంచేసుకున్నాడు.

"వచ్చేఏట యాత్రచేసుకోకూడదటండీ. ఇప్పుడేం మొచ్చిందితొందర ?" భార్య బులాకి అతని ప్రయత్నానికి అడ్డువస్తూఅంది.

"మళ్ళీ సంవత్సరానికి ఎవరెక్కడ ఎలావుంటారో ఎవరికితెల్సు ? దీపంవుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలని తెలీదూ?" తనపని తనుచూసుకుంటూనే జవాబిచ్చాడు సుజన్.

"ఇప్పుడుమీరు గయప్రయాణంపెట్టుకుంటే మనసంసారం బాగుపడినట్లే ! ఆపైనిమీయిష్టం" భర్తను హెచ్చరిస్తూఅంది బులాకి.

"అఁ ! దానికేంలే. అబాగోగులు మానవులచేతుల్లో వుంటే ఇంకేం ? భగవంతుని అనుగ్రహంవుంటే అంతా చల్లగానేవుంటుంది" అభయాన్నిస్తూ అన్నాడు సుజన్.

బులాకి మరేంమాట్లాడలేకపోయింది. అందరితో కలిసి సుజన్ గయకు పయనమయ్యేడు.

గయనుంచిరాగానే పెద్ద పెద్ద విందులు, విరివిగా ధానధర్మాలుచేసేడు సుజన్. అందరూ అతణ్ణిమరింతగా శ్లాఘిస్తూ, ఇంకా బాగాఅదృష్టంకలగాలని దీవించి మరీ వెళ్ళేరు.

"ఎవరైతే సత్కార్యాలకోసం ధనాన్ని విరివిరిగా ధారపోయటాని కుద్యుక్తులౌతారో వాళ్ళకి స్వార్థం అంటూ వుండదు" అన్నాడొక విందుకువిచ్చేసిన పెద్దమనిషి.

గయనుండివచ్చిన దగ్గర్నుంచీ సుజన్ మరీపూర్తిగా మారిపోయాడు ఇప్పుడతనొకవేదాంతి, సత్యవ్రతుడు. పూర్వం కోపంవస్తే కాస్త కటువుగామాట్లాడేవాడు ఇప్పుడదికూడ, మానేసాడు. ఇప్పుడు రోజూ ఇరవైనాలుగు గంటలు భగవంతుని గురించేమాట్లాడ్డమైనా, పూజించటమైనా, ఇదివరకు ఇంటిపనుల్లో ఇతరుల జోక్యంసహించేవాడుకాదు కాని, అసలిప్పుడు ఇంటినిగురించి తలంచటమే మానేసాడు. కేవలం భగవంతునికోసమే తన జీవితాన్ని ధారపోస్తుండడంచేత ఇప్పుడతణ్ణి "సుజన్‌భగత్" అని పిలవటంప్రారంభించారందరూ.

సుజన్ ఇంటిపని ఒక్కటీచూడకపోవటంతో ఇంట్లో ఆర్థికంగా చిక్కులుప్రారంభించాయి కాని, మరొకప్రక్క సుజన్ కీర్తి దేదీప్యమానంగా వెలిగి పోసాగింది.

తన నిత్యకర్మలకీ, తనపూజాదివిషయాలలోనూ, అవసరమైన అన్నిపనులు తనే స్వంతంగా చూసుకుంటున్నాడు. తన స్వంతవిషయాల గురించి ఎవ్వరికీ పూచికపుల్లంతపనైనా కల్పించేవాడుకాదు సుజన్ ఎప్పుడు చూసినా భగవన్నామస్మరణే భగవంతుని అనుగ్రహం పొందటానికి నిత్యం దానధర్మాలుచేస్తుండడంచేత అనతి కాలంలో ఇల్లునిండుకుపోయే పరిస్థితిఏర్పడింది.

ఒకనాడు బులాకి ఇంటిపనులలో సతమతమవుతూ ఎక్కడా తీరుబడిలేక విసుగుచెందుతోంది ఆ సమయానికే ముష్టివాడొకడు "అమ్మా" అంటూ వీధిలోంచికేకేసాడు. ఏదో అవసరమైనపనిచేస్తున్న బులాకి ఆ కేక వినిపించినా, వినిపించుకోనట్లుగానే తనపనిచూసుకుంటోంది ఇంతలో కొడుకు భోలావచ్చి "కాసిన్ని బియ్యంపడేసి పొమ్మనరాదటే" అని తల్లితోఅన్నాడు.

కొడుకు మాటలువిని బులాకికి ఎక్కడలేని కోపం వచ్చింది. "మరేం, నాకిదేపని అనుకున్నావా? లేక నాకేం పది చేతులున్నాయనుకున్నావా అందరికీ అన్నీ చేసిపెట్టడానికి? వెళ్ళి తీరిగ్గాగుమ్మంలో కూర్చున్న మీ నాన్నగారికి చెప్పు" కసురుతోనే అంది బులాకి.

"చెప్పి, చెప్పి నాన్నతోనే చెప్పాలి! సంసారాన్నంతా గంగపాలుచేస్తున్నారు! నాన్నేం చేశారోతెలుసా? మా ఘణ్ణి మణుగు వంకాయలుతీసుకు రమ్మంటే తీసుకొచ్చేడు. నాకు అనుమానంవేసి, తీరా తూచేసరికాల్లా ఒక శేరు తక్కువున్నాయి అయినాసరే, పూర్తిగ్గాడబ్బులిచ్చేయమంటాడు నాన్న కానీ, నేనలాచేయలేదు" తల్లికి తండ్రిమీద ఫిర్యాదుచేశాడు భోలా.

"మంచిపని చేసావునాయనా! అలా వుండాలి తెలివి!" కొడుకును మెచ్చుకుంటూ అంది బులాకి.

"అవును! కాకపోతే మరేంటి? రోజు రోజల్లా భగవంతుణ్ణి పూజించుకుంటూ కూర్చుంటే ఎలా? రివ్వంతైనా ఇంటిపని ముట్టుకోడంలేదు కదా!" చిరాగ్గా అన్నాడు భోలా.

మాటలసందడిలో ముష్టివాడి పిలుపెవరూవినిపించుకోపోయేసరికి సుజన్‌కి కోపంవచ్చింది.

"కాస్త బియ్యంవేసి వీణ్ణి పంపించెయ్యకూడదూ?" కోపంగాఅంటూ," ఏదో ఒక మంచిపనంటూచేసి, దేవుడి మెప్పుపొందండి ఆ బియ్యం ఎక్కడ తగలేశారో చెప్పండి, నేనేవేస్తాను" అని చిరాగ్గాఅంటూ ఇంట్లోకి వచ్చేడు సుజన్.

"మరేం! సంవత్సరమల్లా రాత్రనక, పగలనక కష్టపడి పండించింది వచ్చిపోయే అడ్డమైనవాళ్ళకి తగలెయ్యటానికి సిద్ధంగా ఎవరూలేరిక్కడ" కోపంగా జవాబిచ్చింది బులాకి

భార్యమాటలకి మండిపోయేడు సుజన్ గబగబా ఒక బుట్టడుబియ్యం గాదెలోంచితీసేడు ముష్టివాడికని, కాని, భోలా తండ్రిచేతులలోంచి అమాంతంగా ఆ బుట్టను లాక్కున్నాడు

"ఎన్నాళ్ళో కష్టపడితే దొరికినఫలితం ఇది ఇలా నీ యిష్టంవచ్చినట్లు ఇల్లు గుల్లచేస్తానంటే సహించేదిలేదు" తండ్రిని కాస్త కటువుగానే అన్నాడు భోలా

తనవంటి వాణ్ణికొడుకే అలా అంటాడని ఎప్పుడూ వూహించలేదు సుజన్. "నేనెప్పుడూ సోమరిలాకూర్చోలేదు. నేనూకష్టపడ్డాను" విచారంపుట్టి పడుతూ అన్నాడు సుజన్.

"అలా అయితేసరే! ధాన్యంలో నీభాగం నీ యిష్టం వచ్చినట్లుచేసుకో. అంతేకాని, కష్టపడి పండించిన ఈ ఫలసాయాన్నంతటినీ నీ యిష్టంవచ్చినట్లు దుబారాచెయ్యటానికివీల్లేదు. ఇల్లు ఎలా నాశనమైపోతూందో నువ్వేమయినా పట్టించుకుంటేగా" తండ్రిని మందలించేడు భోలా.

ఇంకేమనడానికి తోచక ముష్టివాణ్ణి వెళ్ళిపొమ్మన్నాడు దీనంగా సుజన్. తనూపోయి ఇంటిముందర చెట్లక్రింద కూర్చున్నాడు. తనపట్ల భార్యా పుత్రులు చూపినప్రవర్తనకి చాలా బాధపడ్డాడు. సుజన్‌కి ఇల్లువదిలి ఎక్కడికో

పోవాలనిపించింది. అంతులేని ఆలోచనలతో. గాయపడ్డ హృదయంతో ఆరోజల్లా తిండి తిప్పలులేక అలానే చెట్టు క్రిందకూర్చున్నాడు అప్పటికే ప్రొద్దుపోయింది. బులాకి వచ్చి భోజనానికి రమ్మనిపిల్చింది. కాని, సుజన్ భార్య మాటలువినిపించుకో లేదు

అసలీ తగువంతా బులాకినుంచి వచ్చిందే! అందుకే అతనికి ఆమెతో మాట్లాడ్డమంటే అసహ్యమనిపించింది భార్యా పుత్రులుకలిసి తనకుచేసిన అవమానానికి, సుజన్ వాళ్ళంటే విరక్తుడై పోయేడు

తన మాటల్ని వినిపించుకోకపోవటంతో బులాకి హృదయంనొచ్చుకుంది. "వయస్సు మళ్ళుతున్నకొద్దీ. ఛాదస్తంమరీ ఎక్కువై పోతోంది. భోలా ఏమన్నాడని ఈ పట్టుదల? కష్టపడి పండించిన పంట అయినవాళ్ళకీ. కాని వాళ్ళకి వేయొద్దన్నాడనేనా? వాడలా అనటమేతప్పా?" భర్తను దీనంగా బ్రతిమాలింది బులాకి

భార్య మాటలు సుజన్‌కి మరింతకోపాన్ని కలిగించేయి. లేదు. లేదు! వాడో కర్రుచ్చుకుని నన్నోనాలుగు కొడితే నీకు సంతోషంగావుండేది, పొరపాటున వాడాపని చెయ్యటం మరిచిపోయేడు. ఆకాస్త పనీనువ్వే అయిందనిపించు" కళ్ళెర్రజేస్తూ అన్నాడు సుజన్

"మీఅదృష్టంబాగుండబట్టి నాలాంటిది పెళ్ళాంగా దొరికింది. అందుకే కోతిని కొమ్మఎక్కించినట్లు ఇష్టంవచ్చినట్టు ఆడిస్తున్నారు. నోటికి వచ్చినట్లల్లా ఆడిపోస్తున్నారు" చిరాకుపడుతూ జవాబిచ్చింది బులాకి.

"కాదమ్మాకాదు! నువ్వొకదేవతవి, నీ పుత్రుడొక సర్వాంతర్యామీను, నేనే శనిగ్రహాన్ని! సరేనా" స్వరం రెట్టించి అన్నాడు సుజన్

"మీ మనస్సేంబాగులేదు. లెండి భోజనానికి. కడుపు చల్లబడితే అంతా సర్దుకుపోతుంది, మీరు భోజనంచెయ్యకపోతే నాకేనేవిఁటి తిండికావాలి? నేనూ పడుకుంటాను" ప్రాధేయపడుతూ అంది బులాకి.

"నాగురించి మీరెందుకు బాధపడటం? ఈ ఆస్తి అంతా నీదీ, నీ కొడుకుదీను. నేను పరాయివాణ్ణి. నేనెలాపోతే మీకేం? మీరు సుఖపడండ"ని తిరిగి జవాబిచ్చేడు సుజన్.

"భోలా మీకు కొడుకేనన్నమాట మరిచిపోయేరులా వుంది" జ్ఞాపకంచేస్తున్నట్లుగా అంది బులాకి.

"ఛీ! వాడు నాకు కొడుకేకాడు. వాడే నాకొడుకైతే నన్నిలా అవమానిస్తాడా?" సుజన్‌కింకా కోపంతగ్గలేదు.

"మీరు మాట్లాడుతున్నదానికేం అర్ధంవున్నట్టులేదు! ఏది ఎలా మాట్లాడాలో తెలుసుకోవడం అసలేలేదుకదా ఏదిఏలాజరగాలో అలాజరుగుతుంది కాలాన్నిబట్టి నడుచుకోకపోతేఎలా? చుట్టూరావున్న పరిస్థితుల్ని అర్థంచేసుకోకపోతే అధోగతి పాలవాల్సివస్తుంది నేను చెప్తున్నది కొస్త అర్ధంచేసుకోండి సరేకాని ఇకపదండి భోంచేద్దురుగాని" వేదాంతాన్నిభోధిస్తూ అంది బులాకి

"అంటే నువ్వనేదేవిఁటి? నాబుద్ధిగడ్డితింటోందనా? నేను ప్రపంచంలో జీవిస్తున్నా లేనట్టేలెఖ్ఖా?" కోపంగా అడిగాడు సుజన్.

"నేనన్నది అదికాదు. నాకు తోచిందినేనుచెప్పేను: మీకుతోచింది మీరుచేయండి" అని రుస రుసలాడుతూ ఇంట్లోకిపోయింది బులాకి. కాని. సుజన్‌లో ఏమాత్రం పరివర్తన కలగలేదు.

"సుజన్‌మనసులో ఆలోచనలతుఫాను వుధృతంఎక్కువయింది ఇదివరకు తను ఇంట్లో అందరికీ కావల్సినవాడు అప్పుడు తనకి. ఇంట్లో శాంతిసౌఖ్యాలుండేవి ఇప్పటికీ ఇంట్లో ఆ పరిస్థితులేవున్నాయని భ్రమించేడు. కాని పరిస్థితులన్నీ తారుమారయ్యేయి. ఒకనాడు తనని గౌరవించిన కుటుంబం. ఇప్పుడు తనమాటల్నే లెఖ్ఖచెయ్యటంలేదు అతనికిప్పుడింట్లో స్వాతంత్ర్యంలేదు. అంచేత తిరిగి తనస్థానాన్ని తను ఆక్రమించుకోవాలి అప్పుడు తన యిష్టంవచ్చినట్టు భగవంతునికి తనసర్వాన్ని సమర్పించుకోవచ్చు" అనుకున్నాడు తనలో.

రాత్రి ఎంత వేళయిందోతెలియదు. కాని, సుజన్ లేచి పశువులకి కుడితికలిపేడు గడ్డికోసి పశువులకి మేత వేశాడు.

తొలికోడికూత వినగానే బులాకి లేచింది. పెరటిలోకి వెళ్ళి పశువులముందున్న గడ్డిమేటిచూసి "ఇది ఏలా వచ్చిందో" అని ఆశ్చర్యపోయింది. "బహుశా భోలాయే వేసివుంటాడేమో" నని తనకు తానేసమాధానం చెప్పుకుంది భోలాలేచి ఆగడ్డిమేటినుచూసి తల్లికంటె ఎక్కువగా ఆశ్చర్యపోయేడు

చల్దితిని భోలా. తమ్ముడు శంకర్‌తోకలిసి ఖజాన నాగళ్ళువేసుకుపొలానికి వెళ్ళేడు. భోలా వెళ్ళేసరికి సుజన్ సగానికిపైగా భూమిదున్నేశాడు. కాని. భోలా ఏం మాట్లాడకుండా తనపని తనుచేసుకున్నాడు.

గయనుండివచ్చిన దగ్గర్నుంచీ సుజన్ మరీపూర్తిగా మారిపోయాడు ఇప్పుడతనొకవేదాంతి, సత్యవ్రతుడు. పూర్వం కోపంవస్తే కాస్త కటువుగామాట్లాడేవాడు ఇప్పుడదికూడ, మానేసాడు. ఇప్పుడు రోజూ ఇరవైనాలుగు గంటలు భగవంతుని గురించేమాట్లాడ్డమైనా, పూజించటమైనా, ఇదివరకు ఇంటిపనుల్లో ఇతరుల జోక్యంసహించేవాడుకాదు. కాని, అసలిప్పుడు ఇంటినిగురించి తలంచటమే మానేసాడు. కేవలం భగవంతునికోసమే తన జీవితాన్ని ధారపోస్తుండడంచేత ఇప్పుడతణ్ణి "సుజన్‌భగత్" అని పిలవటంప్రారంభించారందరూ

సుజన్ ఇంటిపని ఒక్కటీచూడకపోవటంతో ఇంట్లో ఆర్థికంగా చిక్కులుప్రారంభించాయి. కాని, మరొకప్రక్క సుజన్ కీర్తిదేదీప్యమానంగా వెలిగి పోసాగింది.

తన నిత్యకర్మలకీ, తనపూజాదివిషయాలలోనూ, అవసరమైన అన్నిపనులు తనే స్వంతంగా చూసుకుంటూన్నాడు. తన స్వంతవిషయాల గురించి ఎవ్వరికీ పూచికపుల్లంతపనైనా కల్పించేవాడుకాదు సుజన్ ఎప్పుడు చూసినా భగవన్నామస్మరణే భగవంతుని అనుగ్రహం పొందటానికి నిత్యం దానధర్మాలుచేస్తుండడంచేత అనతికాలంలో ఇల్లునిండుకుపోయే పరిస్థితిఏర్పడింది.

ఒకనాడు బులాకి ఇంటిపనులలో సతమతమవుతూ ఎక్కడా తీరుబడిలేక విసుగుచెందుతోంది ఆ సమయానికే ముష్టివాడొకడు "అమ్మా" అంటూ వీదిలోంచికేకేసాడు. ఏదో అవసరమైనపనిచేస్తున్న బులాకి ఆ కేకవినిపించినా, వినిపించుకోనట్టుగానే తనపనిచూసుకుంటోంది ఇంతలో కొడుకు భోలావచ్చి "కాసిన్ని బియ్యంపడేసి పొమ్మనరాదటే" అని తల్లితోఅన్నాడు

కొడుకు మాటలువిని బులాకికి ఎక్కడలేని కోపం వచ్చింది. "ఏరేం? నాకిదేపని అనుకున్నావా? లేక నాకేం పది చేతులున్నాయనుకున్నావా అందరికీ అన్నీ చేసిపెట్టడానికి? వెళ్ళి తీరిగ్గాగుమ్మంలో కూర్చున్న మీ నాన్నగారికి చెప్పు" కసురుతోనే అంది బులాకి

"చెప్పి, చెప్పి నాన్నతోనే చెప్పాలి! సంసారాన్నంతా గంగపాలుచేస్తున్నారు! నాన్నేం చేశారోతెలుసా? 'మా ఘణ్ణి మణుగు వంకాయలుతీసుకు రమ్మంటే తీసుకొచ్చేడు. నాకు అనుమానంవేసి, తీరా తూచేసరికాల్లా ఒక శేరు తక్కువున్నాయి అయినాసరే, పూర్తిగ్గాడబ్బులిచ్చేయమంటాడు నాన్న కానీ, నేనలాచేయలేదు" తల్లికి తండ్రిమీద ఫిర్యాదుచేశాడు భోలా.

"మంచిపని చేసావునాయనా! అలా వుండాలి తెలివి!" కొడుకును మెచ్చుకుంటూ అంది బులాకి.

"అవును! కాకపోతే మరేంటి? రోజు రోజల్లా భగవంతుణ్ణి పూజించుకుంటూ కూర్చుంటే ఎలా? రవ్వంతైనా ఇంటిపని ముట్టుకోడంలేదు కదా!" చిరాగ్గా అన్నాడు భోలా.

మాటలసందడిలో ముష్టివాడి పిలుపెవరూవినిపించుకోపోయేసరికి సుజన్‌కి కోపంవచ్చింది.

"కాస్త బియ్యంవేసి వీణ్ణి పంపించెయ్యకూడదూ?" కోపంగాఅంటూ," ఏదో ఒక మంచిపనంటూచేసి, దేవుడి మెప్పుపొందండి ఆ బియ్యం ఎక్కడ తగలేశారో చెప్పండి, నేనేవేస్తాను" అని చిరాగ్గాఅంటూ ఇంట్లోకి వచ్చేడు సుజన్.

"మరేం! సంవత్సరమల్లా రాత్రనక, పగలనక కష్టపడి పండించింది వచ్చీపోయే అడ్డమైనవాళ్ళకి తగలెయ్యటానికి సిద్ధంగా ఎవరూలేరిక్కడ" కోపంగా జవాబిచ్చింది బులాకి

భార్యమాటలకి మండిపోయేడు సుజన్ గబగబా ఒక బుట్టడుబియ్యం గాదెలోంచితీసేడు ముష్టివాడికని, కాని, భోలా తండ్రిచేతులలోంచి అమాంతంగా ఆ బుట్టను లాక్కున్నాడు

"ఎన్నాళ్ళో కష్టపడితే దొరికినఫలితం ఇది ఇలా నీ యిష్టంవచ్చినట్టు ఇల్లు గుల్లచేస్తానంటే సహించేదిలేదు" తండ్రిని కాస్త కటువుగానే అన్నాడు భోలా

తనంటి వాణ్ణికొడుకే అలా అంటాడని ఎప్పుడూ వూహించలేదు సుజన్. "నేనెప్పుడూ సోమరిలాకూర్చోలేదు. నేనూకష్టపడ్డాను" విచారంపుట్టి పడుతూ అన్నాడు సుజన్.

"అలా అయితేసరే! ధాన్యంలో నీభాగం నీ యిష్టం వచ్చినట్టుచేసుకో. అంతేకాని, కష్టపడి పండించిన ఈ ఫలసాయాన్నంతటినీ నీ యిష్టంవచ్చినట్లు దుబారాచెయ్యటానికివీల్లేదు. ఇల్లు ఎలా నాశనమైపోతూందో నువ్వేమయినా పట్టించుకుంటేగా" తండ్రిని మందలించేడు భోలా.

ఇంకేమనడానికి తోచక ముష్టివాణ్ణి వెళ్ళిపొమ్మన్నాడు దీనంగా సుజన్. తనూపోయి ఇంటిముందర చెట్లక్రింద కూర్చున్నాడు. తనపట్ల భార్యా పుత్రులు చూపినప్రవర్తనకి చాలా బాధపడ్డాడు. సుజన్‌కి ఇల్లువదిలి ఎక్కడికో

పోవాలనిపించింది. అంతులేని ఆలోచనలతో. గాయపడ్డ హృదయంతో ఆరోజల్లా తిండి తిప్పలులేక అలానే చెట్టు క్రిందకూర్చున్నాడు. అప్పటికే ప్రొద్దుపోయింది. బులాకి వచ్చి భోజనానికి రమ్మనిపిల్చింది. కాని, సుజన్ భార్య మాటలువినిపించుకో లేదు.

అసలీ తగువంతా బులాకినుంచి వచ్చిందే! అందుకే అతనికి ఆమెతో మాట్లాడ్డమంటే అసహ్యమనిపించింది. భార్యా పుత్రులుకలిసి తనకుచేసిన అవమానానికి, సుజన్ వాళ్ళంటే విరక్తుడై పోయేడు.

తన మాటల్ని వినిపించుకోకపోవటంతో బులాకి హృదయంనొచ్చుకుంది. "వయస్సు మళ్ళుతున్నకొద్దీ. ఛాదస్తంమరీ ఎక్కువై పోతోంది. భోలా ఏమన్నాడని ఈ పట్టుదల? కష్టపడి పండించిన పంట అయినవాళ్ళకీ, కాని వాళ్ళకి వేయొద్దన్నాడనేనా? వాడలా అనటమేతప్పా?" భర్తను దీనంగా బ్రతిమాలింది బులాకి.

భార్య మాటలు సుజన్‌కి మరింతకోపాన్ని కలిగించేయి. లేదు. లేదు! వాడో కర్రుచ్చుకుని నన్నోనాలుగు కొడితే నీకు సంతోషంగావుండేది, పొరపాటున వాడాపని చెయ్యటం మరిచిపోయేడు. ఆకాస్త పనీనువ్వే అయిందనిపించు" కళ్ళెర్రజేస్తూ అన్నాడు సుజన్.

"మీఅదృష్టంబాగుండబట్టి నాలాంటిది పెళ్ళాంగా దొరికింది. అందుకే. కోతిని కొమ్మఎక్కించినట్లు. ఇష్టంవచ్చినట్టు ఆడిస్తున్నారు. నోటికి వచ్చినట్లల్లా ఆడిపోస్తున్నారు" చిరాకుపడుతూ జవాబిచ్చింది బులాకి.

"కాదమ్మాకాదు! నువ్వొకదేవతవి, నీ పుత్రుడొక సర్వాంతర్యామీను; నేనే శనిగ్రహాన్ని! సరేనా" స్వరం రెట్టించి అన్నాడు సుజన్.

"మీ మనస్సేంబాగులేదు. లెండి భోజనానికి. కడుపు చల్లబడితే అంతా సర్దుకుపోతుంది, మీరు భోజనంచెయ్యక పోతే నాకేనేవిఁటి తిండికావాలి? నేనూ పడుకుంటాను" ప్రాథేయపడుతూ అంది బులాకి.

"నాగురించి మీరెందుకు బాధపడటం? ఈ ఆస్తి అంతా నీదీ, నీ కొడుకుదీను. నేను పరాయివాణ్ణి. నేనెలాపోతే మీకేం? మీరు సుఖపడండ"ని తిరిగి జవాబిచ్చేడు సుజన్.

"భోలా మీకు కొడుకేనన్నమాట మరిచిపోయేరులా వుంది" జ్ఞాపకంచేస్తున్నట్లుగా అంది బులాకి.

"ఛీ! వాడు నాకు కొడుకేకాడు. వాడే నాకొడుకైతే నన్నిలా అవమానిస్తాడా?" సుజన్‌కింకా కోపంతగ్గలేదు.

"మీరు మాట్లాడుతున్నదానికేం అర్థంవున్నట్లులేదు! ఏది ఎలా మాట్లాడాలో తెలుసుకోవడం అసలేలేదుకదా ఏదిఏలాజరగాలో అలాజరుగుతుంది. కాలాన్నిబట్టి నడుచుకోకపోతేఏలా? చుట్టూరావున్న పరిస్థితుల్ని అర్థంచేసుకోకపోతే అధోగతి పాలవాల్సివస్తుంది. నేను చెప్తున్నది కాస్త అర్థంచేసుకోండి. సరేకాని. ఇకపదండి భోంచేద్దురుగాని" వేదాంతాన్నిభోధిస్తూ అంది బులాకి.

"అంటే నువ్వనేదేవిఁటి? నాబుద్ధిగడ్డితింటోందనా? నేను ప్రపంచంలో జీవిస్తున్నా లేనట్టేలెఖ్ఖా?" కోపంగా అడిగాడు సుజన్.

"నేనన్నది అదికాదు. నాకు తోచిందినేనుచెప్పేను: మీకుతోచింది మీరుచేయండి" అని రుస రుసలాడుతూ ఇంట్లోకిపోయింది బులాకి. కాని. సుజన్‌లో ఏమాత్రం పరివర్తన కలగలేదు.

"సుజన్‌మనసులో ఆలోచనలతుఫాను వుధృతంఎక్కువయింది. ఇదివరకు తను ఇంట్లో అందరికీ కావల్సినవాడు. అప్పుడు తనకి. ఇంట్లో శాంతిసౌఖ్యాలుండేవి. ఇప్పటికీ ఇంట్లో ఆ పరిస్థితులేవున్నాయని భ్రమించేడు. కాని పరిస్థితులన్నీ తారుమారయ్యేయి. ఒకనాడు తనని గౌరవించిన కుటుంబం. ఇప్పుడు తనమాటల్నే లెఖ్ఖచెయ్యటం లేదు. అతనికిప్పుడింట్లో స్వాతంత్ర్యంలేదు. అంచేత తిరిగి తనస్థానాన్ని తను ఆక్రమించుకోవాలి. అప్పుడు తన యిష్టంవచ్చినట్టు భగవంతునికి తనసర్వాన్ని సమర్పించుకోవచ్చు" అనుకున్నాడు తనలో.

రాత్రి ఎంత వేళయిందోతెలియదు. కాని, సుజన్ లేచి పశువులకి కుడితికలిపేడు. గడ్డికోసి పశువులకి మేత వేశాడు.

తొలికోడికూత వినగానే బులాకి లేచింది. పెరటిలోకి వెళ్ళి పశువులముందున్న గడ్డిమేటిచూసి "ఇది ఏలా వచ్చిందో" అని ఆశ్చర్యపోయింది. "బహుశా భోలాయే వేసివుంటాడేమో" నని తనకు తానేసమాధానం చెప్పుకుంది భోలాలేచి ఆగడ్డిమేటినుచూసి తల్లికంటె ఎక్కువగా ఆశ్చర్యపోయేడు.

చద్దితిని భోలా. తమ్ముడు శంకర్‌తోకలిసి భుజాన నాగళ్ళువేసుకుపొలానికి వెళ్ళేడు. భోలా వెళ్ళేసరికి సుజన్ సగానికిపైగా భూమిదున్నేశాడు. కాని. భోలా ఏం మాట్లాడకుండా తనపని తనుచేసుకున్నాడు.

మిట్టమధ్యాహ్నమైంది. సూర్యుడు నడినెత్తిమీద కొచ్చేడు పనివాళ్ళంతా సంగటితిని, విశ్రాంతి తీసుకోటానికని చెట్లనీడను చేరుకున్నారు. కాని, సుజన్ ఒక్కడూ ఆ మండుటెండలో పనిచేస్తూనే వున్నాడు.

కొంతమందిమాత్రం ఇంటికే పోతున్నారు భోజనానికి. భోలాకూడా తండ్రితో చెప్పి వెళ్దామనుకున్నాడు. కాని, తండ్రిని చూస్తుంటే భోలా నవనాళ్ళూ ఒణికి పోసాగినయి. ఏలా అయితేనేం ధైర్యంచేసి "ఇక ఎద్దుల్ని ఇప్పేయమన్నారా నాన్నా?" వణుకుతూన్న గొంతుతో.

"ఆఁ! అలాగేచెయ్యి! ఎద్దుల్ని ఇంటికి తోలుకుపో. నేను విత్తులు జల్లివస్తా" అతని గొంతుకలో కఠినత్వం ఇంకా తగ్గలేదు.

పొలంపని ముగించుకు ఇంటికివచ్చిన సుజన్ ఏమీ అలిసిపోయినట్లు కనిపించలేదు. స్నానంచేసి భోజనం చేసేడు. పెరట్లోకివెళ్ళి కుడితితాగుతున్న పశువుల గంగడోళ్ళను ప్రేమతోనిమిరేడు. అవికూడా అతన్ని ప్రేమతో చూసేయి.

కాస్త విశ్రాంతి తీసుకున్న తరువాత తిరిగి పొలానిని నాగలి తీసుకుబయల్దేరేడు సుజన్ అప్పటికి భోలాకాని, మరెవ్వరూ కాని ఇంకా బయల్దేరలేదు. పొలానికి వెళ్తున్న తండ్రిని చూసేడు భోలా. అతనికీ వెళ్ళాలనేవుంది కాని, ఒంట్లోశక్తి వుడిగిపోయింది.

"ఇంకా ఇక్కడనేవున్నావ్? పొలానికి వెళ్ళవాఏం?" ప్రశ్నించింది తల్లి.

తను చాలా అలసిపోయానని, పొలం వెళ్ళటానికి శక్తిలేదని జవాబిచ్చేడు భోలా.

సుజన్ తిరిగి ఇంటి పనులుచూస్తూ, భగవంతునిమరుస్తున్నందుకు అందరూ అతన్ని విమర్శించటం మొదలెట్టారు. వయస్సుమళ్ళినా భౌతిక సుఖాలను వదల్లేక పోతున్నందుకు కొందరు అతన్ని పరిహసిస్తూండేవారు. అయినాసరే, అతనింటికి అతిధులు రావటంమాన్లేదు; వచ్చినవాళ్ళకి లేదనకుండా పెడుతున్నాడు. రోజులు గడుస్తున్నాయి. ఆ సంవత్సరంకూడా భూములుపుష్కలంగానే పండేయి.

అది చైత్రమాసం. వరిచేలన్నీ నూర్పులకి సిద్ధంగా కుప్పలుగా పేర్చివున్నాయి. సుజన్ పొలంలోకూడా అలాంటి కుప్పలు ఎక్కువగానేవున్నాయి. ఇనాంకోసం కొందరూ, బిచ్చగాళ్ళకొందరూ. మొత్తంమీద చాలా మంది పోగయ్యారు సుజన్ కళ్ళలో. వాళ్ళందర్నీ చూస్తుంటే సుజన్‌కి పరమానందమయింది. వాళ్ళలో ఇదివరకు తనింటికి ముష్టికివచ్చి పట్టిచేతులలో వెళ్ళిపోయిన వాడుకూడా వున్నాడు. సుజన్ అతన్ని ఇట్టే గుర్తించేడు బిచ్చగాడి భుజంతడుతూ "ఎక్కడికి వెళ్ళి వస్తున్నావ్?" అనడిగేడు

"అబ్బే ఎక్కడికీ ఇంకావెళ్ళలేదు. తిన్నగా ఇక్కడికే వస్తున్నానండీ" వినయంగా జవాబిచ్చాడు బిచ్చగాడు,

"సరే అయితే! మరేంఫరవాలేదు. ఇదుగో ఈధాన్యం కుప్పను చూస్తున్నావా? నీ క్కావల్సినన్ని పట్టుకుపో" అనుజ్ఞఇచ్చేడు సుజన్.

"ఆ మాటవినగానే బిచ్చగాడు ఆశ్చర్యపోయేడు. ఒక్కసారి సుజన్ని, కుప్పని, చుట్టూవున్న వాళ్ళనీ అదోలా చూసేడు అతడికేంచెయ్యటానికి తోచలేదు." తమరెన్నిస్తే అంతేచాలు" ఆశతో చూస్తూ అన్నాడు.

"అదేమిటోయ్ అలా అంటావ్. నీకెన్నికావాలో అన్ని తీసుకోమంటినిగా!" హెచ్చరిస్తూ అన్నాడు సుజన్.

బిచ్చగాడు భుజంమీద తుండుగుడ్డనుతీసి పదిశేర్లదాకా ధాన్యం గుడ్డలో పోసుకున్నాడు. అతనికి ఇంకా మరి కొంచం తీసుకోవాలనుంది కాని, చుట్టూవున్నవాళ్ళని చూస్తుంటే సిగ్గూ. భయంపుట్టుకొచ్చేయి

బిచ్చగాడి' అవస్థచూస్తుంటే సుజన్‌కి జాలివేసింది. "అదేవిఁటి? అంతకొంచంతీసుకున్నావు? మరేంఫరవా లేదు ఇంకా తీసుకో" అన్నాడు.

బిచ్చగాడు మరికొన్ని ధాన్యంతీసుకుంటూ, తనకేసి చూస్తూ అక్కడే నిల్చున్న భోలాని చూసేడు. భోలాని చూసేసరికల్లా అతనికి చాలాభయంవేసి "ఇంక చాల్లెండి" అంటూ మూటకట్టుకోబోయేడు.

"అదేవిఁటి వాడినిచూసి భయపడతావేం? నీక్కావల్సినన్ని తీసుకుపొమ్మని నేను చెప్తున్నాగా! ఊఁ! ఆలస్యం చెయ్యకు" తిరిగి హెచ్చరించేడు, సుజన్.

అయినాసరే బిచ్చగాడికి ధైర్యంకలగలేదు. తీరా ఇంకా తీసుకుంటే భోలా అన్నీకలిపి లాక్కుంటాడేమోనని అనుమానంతో కూడిన భయంవేసింది. అది గమనించిన సుజన్. ఆ గుడ్డపట్టి నన్ని 'ధాన్యం "మూటకట్టి ఇక తీసుకపో" అన్నాడు.

బిచ్చగాడు హృదయం సంతోషంతో నిండిపోయింది. కాని. అంతపెద్ద మూటను నెత్తికెత్తుకో లేకపోయేడు.

అది చూసి "అదేమిటయ్యా! ఆమాత్రం బరువు మోయ లేకపోతే ఇంకెందుకు పనికొస్తావ్? ప్రయత్నించిచూడు" అన్నాడు సుజన్.

బిచ్చగాడు ప్రయత్నించాడు కాని. లాభంలేకపోయింది: అతన్ని చూసి సుజన్ "ఏవూరు మీది?" అనడిగేడు.

"ఓ యబ్బో! మా వూరెక్కడ! ఇక్కడికి చాలా దూరం అకోలాగ్రామంలో వుంటున్నాను" అన్నాడు బిచ్చగాడు

"ఓస్! అకోలాయేనా! అయితే ఫర్వాలేదు. నువ్వు ముందునడువు నేను తీసుకొచ్చి మీ ఇంటపడేస్తాను" అంటూ ఒక్కవూపుతో అంత బరువైన మూటను నెత్తి కెక్కించుకున్నాడుసుజన్ ఈ నాటకాన్ని చూస్తూ అక్కడ నుల్చున్న వాళ్లెవరికి ఇతడలా ఎందుకు చేస్తున్నాడో తెలియక కళ్ళప్పగించి చూస్తూనిల్చున్నారు

సాధారణంగా ఆ వయస్సులో అంత బరువుమొయ్యటం తేలికయినపనికాదు కాని, తిరిగి తను ఇంటా బయటా సంపాదిచుకున్న పలుకుబడి అతనికి ఉత్సాహాన్నిచ్చింది. ఆ ఉత్సాహమే అతనిచేత ఎంతటికష్టమైన, పనయినా తేలికగాచేయిస్తుంది

మొద్దుబారిన కత్తితో అరటిపండు కోయటంకూడా అతి కష్టం కాని, ఆ కత్తికే సానపడితే ఉక్కుకడ్డీలను సహితం అతి చులాగ్గాకోసేస్తుంది

మనిషికీ మనిషికీ మధ్యనున్న సంబంధం మానవ జీవితంలో అతి విలువైంది. అది ఎంతటి ముసలివాణ్ణయినా చిన్న పిల్లాడిలాచేస్తుంది. కాని, ఎవడైతే ప్రపంచంతో సంభంధలేకుండా సంచరిస్తూంటాడో వాడు మృత జీవునిక్రిందేలెఖ్ఖ. అందుకే సుజన్ తన వాళ్ళందర్నీ ప్రేమతో చూస్తున్నాడు ఆస్వభావం అతనికి గొప్ప మనోబలాన్నీ, అనిర్వచనీయమైన శక్తిని ప్రసాదించింది.

సుజన్ బయల్దేరులో భోలానుపిల్చి "భోలా! వీళ్లల్లో ఏ ఒక్కరినీ ఒట్టి చేతుల్తో పంపించకు. అందరికి వాళ్ళకి కావల్సినన్ని ధ్యాన్యంఇయ్యి" హుకుం జారీచేసేడు.

ఇదివరకు తండ్రి నెదిరించిన భోలా, ఈసారి నోరు మెదపకుండా శిలాప్రతిమలా నిల్చుని తండ్రి చెప్పిన మాటల్ని విన్నాడు తనిదివరకు తండ్రినన్నమాటలు స్ఫురణకు రాగానే సిగ్గుపడ్డాడు భోలా, అనిఅతణ్ణీ కలవరపర్చేయి, లోలోన పరితపించి పశ్చాత్తాపపంజెందాడు.

ఒక్కముసలి తండ్రి యువకుడైన కొడుకుపై విజయం సాధించేడు.

ఆ పందెంలో భోలా చిత్తుగా ఓడి పోయేడు 

మాతృహృదయపు లోతెరిగిన మహితురాలు :

# ద్రౌపది

రచన :
కె. జలజ

అశ్వత్థామావమానము బమ్మెర పోతనామాత్య ప్రణీతంబగు శ్రీ మదాంధ్ర భాగవతము నందలి ప్రథమ స్కంధములోనిది.

'మధురరసఝరీ మాధురీధురీణ నిరుపమాన నిరర్గళకవిత్వధారా విరాజితుండగు' పోతనామాత్యుడు తన భాగవతమున ద్రౌపదీ శీలమును చక్కగ అభివర్ణించినాడు.

తన పుత్రులగు ఉప పాండవులను ఎదిరించుచుండగా అశ్వత్థామ వారిని పాపమనక క్రూరాత్ముడై తన కరవాలమునకు బలియొనర్చినాడు. అది ఎఱింగిన ద్రౌపది "గలంగి, యలంగి, యోగువంజాలక బాష్పతోయకణజాలము చెక్కుల రాలనేడ్చి"నది. బిడ్డలపైగల ప్రేమతో పలువిధముల దురపిల్లినది. ఆమె మాతృహృదయం పుత్ర వియోగముతో మోడు వారినది. అంత అర్జునుడు "ధరణీశాత్మజవీవు, నీకు వగపన్ ధర్మంబె" అని అనునయింప దలచినాడు. కాని ఆమె రోదన సామాన్య రోదనగాదు. కడుపు శోకముచే దగ్ధమై—నీరుగారి పోవుచున్నది. అట్టి యెడ అర్జునుడు "మద్గాండీవనిర్ముక్త భీకరబాణంబుల నేను వానిశిరమున్ ఖండించి తెత్తు- దచ్చిరముం ద్రొక్కి జలంబులాడు మిచటన్!" అని పలికినాడు

పుత్రులచావుకు కుంగుచు వేదనపడుతూన్న ఆమె హృదయం ప్రతీకారానికి వెనుకాడదని తలంచుతాము. కాని ఆమెకు అలాంటి వాంఛ గలుగుతుందా.. ?

అటుల పలికిన అర్జునుడు కృష్ణునిగూడి అశ్వత్థామపైకి బయలుదేరెను, తన్నుం జంపెదనంచు వచ్చు విజయుని జూచి ద్రౌణి ప్రాణములపై తీపితో పరుగిడజొచ్చెను.

ఓపినంత దూరము బరువిడి అర్జునుని అశ్వంబులు అలయుట నెరింగి, ప్రయోగమేగాని ఉపసంహార మెరుంగని బ్రహ్మశిరోనామకాస్త్రమును ఆత్మ సంరక్షణార్థమై అర్జునునిపై వైచెను.

అంతనాఅస్త్రము "సకలప్రాణి భయంకరమై వచ్చుచుండ అర్జునుడు అయ్యది బ్రహ్మశిరోనామకాస్త్రమని మాధవునివలన తెలుసుకొని దానికి ప్రతిగా తన బ్రహ్మాస్త్రమును వైచెను. రెండు అస్త్రములు సకలప్రాణి భయంకరముగా పోరాడుచుండగా మాధవునాజ్ఞచే విజయుడు రెండు అస్త్రముల నుపసంహరించి ద్రౌణిని బట్టి తలనరుకబోగా మాధవుడువారించి వానిని దోడ్కొని ద్రౌపది కడకరుదెంచెను.

అంత ద్రౌపది "బరుషమహాపాప బద్ధపాణిన్ ద్రోణిన్" జూచెను. తను ఎంతటి దుఃఖములోనున్నను మర్యాద పాటించి కృపికొడుకుంజూచి మొక్కి "నాభర్తలు తమ పితృదేవులైన ద్రోణాచార్యులవారి శిష్యులు. మరి నీవు పుత్రాకృతినున్న ద్రోణుడవు. కాని నీ చిత్తములో లేశముం గరుణాసంగము లేక శిష్య సుతులన్ ఖండింప చేతులెట్లాడెనో యని మెల్లగా మందలించినది.

దీనివలన ఆమె మనోనిగ్రహాము వెల్లడియగుచున్నది.

"భూసురడవు, బుద్ధిదయాభాసురడవు. శుద్ధవీరభట సందోహాగ్రేసరుడవు, శిశుమారణమాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ" యని తన

హృదయములో కోపమంతటినిదిగమ్రింగి, మెత్త మెత్తగ అశ్వత్థామను మందలింప మొదలిడినది. ఒకవైపుకడుపుచిచ్చు భగ భగ మండుచున్ననూ, మరియొకవైపు ఆర్ద్రిత అమెలోమూర్తీభవించినది.

"అక్కటా! పుత్రశోకము జనతాకులభార విషణ్ణచిత్తనై, పొక్కుచునున్న భంగినినుబోరగిరీటి నినుబద్ధుజేసి" యిచ్చుటకు తీసుకొని వచ్చుట నెరింగి నీతల్లినినుదలంచి మదిలో ఎంతగా కుమిలి పోతున్నదోగదా. నా పుత్ర వియోగముచే నేనెటుల దుఃఖించుచుంటినో అటులనే నీతల్లి దుఃఖించుచుండును." అనుటలో ద్రౌపదియొక్క మధురమగు మాతృ హృదయము తెలియుచున్నది. సమవయస్కులను, సమబలులను ఎదిరించి చంపవచ్చుగాని పిన్నవారలై బలహీనులగువారిని చీకటిలోవధించుటకు నీచేతులెట్లాడె" అన్న ఆమె మాటలో ఆమె యొక్క యుక్తాయుక్త పరిజ్ఞానము, సమయస్ఫూర్తి మనకు తేటతెల్లమగు చున్నది.

"తండ్రీ" యని ఒకవైపు సంబోధించుచు, నీవు బుద్ధిమంతుడవు, దయాభాసురడవు, అని పొగడి శిశుమారణము రాక్షసకృత్యముగాదా? యని అనుటచే అశ్వత్థామ అసుర కృత్యము చేసినవాడుకనుక అయోగ్యుడు, బుద్ధిమంతుడు గాడు, వీరుడుగాడు, అని పెక్కువిధముల వ్యంగ్యముగా అతని మనస్సుకుబాగా నాటుకొనునటుల ఎత్తి పొడిచినది!

ఇట్టి సందర్భములుకాంచ ద్రౌపది ఎంతటి మాట నేర్పుగలదో తెలియుచున్నది.

"భూపాలకులకు విప్రులను గోపింప జేయంగదు"అని పెక్కువిధములగు నీతులను బోధించి అశ్వత్థామను విడువుమనికోర దాని కందరును సమ్మతించిరి. కాని వాయునందనుడు అందుకంగీకరింపక అశ్వద్ధామను చంపబోవ, నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబువచ్చెను.

"ప్రాణవియుక్తుడైన నతిపాపము, బ్రాహ్మణహింసమానరే" యని పలుకుద్రౌపది పలుకులలో ఆమె ధర్మబుద్ధియు" నీభంగి ద్రోణి తెరల్చి తెచ్చుట విని కృపి యేడ్చు" ననుటలో ఆమె కరుణాబుద్ధియును తేటతెల్లమగుచున్నది. ఆమె పలికిన పలుకులన్నిటిలోను శ్లాఘ్యతగోచరించుచున్నది, అందునను ధర్మజాదులునైతము ఆమె వచోధోరణికి సంతసించిరి.



# నా విదేశ యాత్ర

శ్రీమతి వి. లక్ష్మీపార్వతి హనుమంతరావు.

"స్టాక్‌హోమ్" వదలి మేము "కోపెన్ హాగన్"కు విమానములో బయలు దేరాము. "కోపెన్‌హాగన్" విమానాశ్రయములో దిగగనే అచ్చట మన దేశపు రాయబారి దంపతులు మమ్ములను ఆహ్వానింప వచ్చినారు. వారి కారులోనే దాదాపు మేము "కోపెన్‌హాగన్" అంతా చూసాము. ఆ దేశం పాడి పరిశ్రమలకు ఎంతో ప్రసిద్ధి చెందినది. అచ్చట ఆవులు చూడ టానికి ఎంతో ముచ్చటగా యుంటాయి. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన షేక్స్పియర్ తన హాంలెట్ నాటకంలో పేర్కొన్న క్రాన్‌బర్గు కాసిల్ కూడ చూసాము.

"కోపెన్‌హాగన్" నుండి విమానంలో లండను చేరాము. ఎరుగున్న అనేక మంది మిత్రులను కూడ కల్సుకోనటం జరిగింది. అచ్చట కూడ ఆ మిత్రుల సహాయం వల్ల ప్రపంచ ప్రఖ్యాతి చెందిన బ్రిటీష్ మ్యూజియం, అనేక మంది మహనీయులు సమాధి చేయబడ్డ స్థలం వెస్టుమినిస్టర్ ఎబ్బే, బ్రిటీష్ రెడ్‌క్రాస్, మదమ్ తుస్సాన్డ్స ఎగ్జిబిషన్, హైడ్‌పార్కు, బకింగ్ హామ్‌ప్యాలెస్, కోహినూరువజ్రములతో యున్న రాణీగారి ఆభరణములు, ట్రాఫల్ గర్ స్క్వేరులో నెల్సన్ స్టాట్యూ మొదలగునవి ఎన్నో చూసాము.

"ప్లానటోరియం" సూర్యచంద్రులు మాసాల కాలాల ననుసరించి ఉదయించు, హస్తమించు విధం, నక్షత్రములరీతి అర్థం చేసుకోనగలుగు తాము. క్యూగార్డెన్స్, గ్రీన్‌పార్కు, క్వీన్సు పార్కు, మొదలగునవి, క్యూగార్డెన్స్‌లో ప్రత్యేకించి ఇతర దేశాలనుంచి క్రొత్తరకపు పూల విత్తనాలు, మొక్కలు, కాయగూరల విత్తనాలు, కొనితెప్పించి, అక్కడ వృద్ధి చేస్తున్నారు.

ఇతర ప్రదేశాల కన్నా "లండను"లో జన సమర్థం ఎక్కువగా యున్నట్లనిపించింది. అచ్చట నుండి యార్కుషైర్ కూడ వెళ్ళాము. యార్కుషైర్, పళ్ళ తోటలతో సుందరముగా మనపల్లె ప్రాంతాలవలె పచ్చ పచ్చగా, మధ్య మధ్య తటాకాలతో ఎంతో అందంగా వున్నట్లనిపించింది.

"లండను" నుండి "బ్రస్సల్ డ్రాప్"కు వెళ్లాము. అదిక్రొత్త పట్టణం. చాలా అందంగా వుంది. అచ్చట ఎలక్ట్రిక్ సామానులు చాలా చౌక. ఉల్‌వర్తు షాపింగ్ సెంటర్—ఎంతో బాగా ఏర్పాటు చేసారు.

అచ్చట. నుండి "ప్యారిస్"కు వెళ్లాము. నిజంగా "సీ ప్యారిస్ అండ్ డై" (ప్యారిసును చూడకుండా చచ్చి పోకుసుమీ) అనేదానిలో ఎంతో సత్యముందనుకుంటాను. ఈనాటికి కూడ ఇలాయున్న "ప్యారిస్" సారస్వతంలో ముందంజ వేసిన ఆ రోజులలో యింకా ఎలా వుండి వుండేదో చెప్పనలవి [illegible]

కారులకు ఊహాలు పెంచి ఉరకలు వేయించ టములోను, యువకులను కలవరపెట్టి గిలిగింతలు పెట్టించటములోను, "ప్యారిస్" దానికి అదే సాటి అనిచెప్పాలి. "ప్యారిస్"లో 24 గంllలు అనుకోనకుండా గడిచిపోతాయి. "ప్యారిస్"కు మిగతా యూరప్ నగరాలకూ అన్ని విషయా లలో చాలా తేడా యుండనే చెప్పాలి. ప్రకృతి సౌందర్యానికితోడు పేవుమెంట్ హోటల్స్, ఎచ్చటబడితే అచ్చటకుంచలతో నిర్విచారముగా పనిచేసే కళాకారులు, అనురాగ ఆనందాలతో స్వేచ్ఛగా తిరిగే యువతీ యువకులు, "పారిస్"కు ఎంతో శోభను చేకూరుస్తున్నాయనిపిస్తుంది. ఒక విధంగా చూస్తే అంత తొందరగా 'ప్యారిస్'ను వదలబుద్ధిగాదు- తప్పదు కాబట్టి చేసేదిలేక "ప్యారిస్" వదలి వస్తూయుంటారు. ప్రపంచ ప్రఖ్యాతిచెందిన 300 మీటర్లు పొడవు గల్గి, 700 టన్నుల బరువు గల్గిన ఇఫెల్ టవర్ కూడా చూసాము.

"పారిస్" నుండి "జినీవాకు" వచ్చినాము. ఆగస్టు 15 వ తేదీ. ఆదేశస్థుల పండుగనాడు మేము "జినీవాలో యున్నాము"- వాళ్ళ వేడు కలు, పూలతో అలంకరణ, వాళ్ళు దుస్తులు ధరించటం, క్రొత్త వింత అనిపించింది. వాళ్ళు రంగు కాగితాలు కత్తిరించి చక్కగా పొట్లాలు కట్టి అమ్ముతారు. అవి ఆఖరున ఒకరిపైన ఒకరుచల్లుకుంటారు. మాతలలుకూడాపూలతో నిండిపోయినవి. అచ్చట నేను ముఖ్యంగా చూసింది, ఆర్థోపెడిక్ సెంటర్, జినీవా రెడ్ క్రాస్, రోప్‌వే మొదలగునవి. అచ్చట విక లాంగులైన పిల్లలకు వైద్య విద్యా వ్యాయామ శిక్షణావకాశాలు కల్పించి, సమాజములో జీవిత పోరాటము సాగించటానికి, అవకాశము కల్పించే ఆర్థోపెడిక్ సెంటర్సుని చూడటం, అవి పనిచేసే విధానాన్ని తెల్సుకొనటం నా ముఖ్యోద్దేశము.

మద్రాసులో ఆంధ్రమహిళా సభ ఆధ్వర్యం క్రింద ఉచిత వైద్య సౌకర్యానికి నడుపబడు తున్న నర్సింగ్ హోమ్‌కు స్వర్గస్థులైన చిరంజీవి యీశ్వరీప్రసాద దత్తాత్రేయ జ్ఞాపకార్థం ఆర్థోపెడిక్ సెంటర్ నిర్మాణానికి శ్రీ వి. హనుమంతరావుగారు లక్ష రూపాయలు భూరి విరాళముగా యివ్వటం మీకందరకు తెల్సి యుండవచ్చు- దానికి కేంద్ర ప్రభుత్వం కూడ సహాయం చేస్తూయుంది. భవన నిర్మాణ కార్య క్రమమంతా పూర్తిగా అయ్యి జనవరి 19 వ తారీఖున శ్రీమతి ఇందిరాగాంధీచే ప్రారంభోత్స వము చేయబడింది. దక్షిణ భారతదేశంలో యిలాంటి వికలాంగులైన శిశువులకోసము ప్రత్యేక శ్రద్ధ తీసుకుని వైద్య విద్యా శిక్షణ అవకాశాలు కల్పించే ఆర్థోపెడిక్ సెంటర్సు ఎక్కువగా ఎచ్చటాలేవని చెప్పటం ఏమంత అతిశయోక్తిగాదు.

యూరపులో అనేకచోట్ల యిలాంటి ఆర్థో పెడిక్ కేంద్రాలున్నాయి. "జ్యూరిక్"లో వున్న ఆర్థోపెడిక్ సెంటర్ చాలా ప్రాముఖ్యమనే చెప్పాలి. ఇచ్చట నర్సులను గురించి కొంత చెప్పటం అవసరం అనుకుంటాను. ఆ సమాజ ములోఆవృత్తికియుండే గౌరవాదరాభిమానాలు మాటలతో చెప్పనలవికాదు. జీవితముల విష యములో కూడ అంతే. అచ్చట నర్సులు పని చేసే విధానం, రోగులకువారు చూపే అదరాభి మానాలు తెల్సుకుంటే అజ్ఞానం వల్లనైతేనేమి తగిన అవకాశాలు లేకపోవుటవల్లతేనేమి, ప్రకృతిలోనున్న తేడా వల్లతైనైనేమి, వాళ్ళకు, మనకుఎంతో తేడాయుందని చెప్పవలసివస్తుంది. ప్రత్యేకముగా యిలాంటి ఆర్థోపెడిక్ సెంట ర్సులో నర్సుకెలాంటి స్థానం వుంటుందో, ఆమె మాతృస్థానం అక్రమించి, ఆవికలాంగులైన పిల్ల లకు మాతృమూర్తిగా అన్ని రకాల సౌక ర్యాలు కల్పించి, మానసికంగా, శారీరకంగా,

ఆపిల్లలను వారు తమ యింటిలో, తమ వాళ్లతో పాటు, ఆడుతూ పాడుతూ బ్రతుకుతూ వున్నట్లు వారు భావించే విధముగా, నడవటములో ఈ నర్సుల బాధ్యత ఎంత వరకు యున్నవో చెప్ప నలవికాదు. అలాంటి కుటుంబ వాతావరణాన్ని కల్పించటములో అచ్చట నర్సులు ఎంత శ్రద్ధ తీసుకుంటారో "జ్యూరిక్" ఆర్థోపెడిక్ సెంటర్సు లాంటి హాస్పిటల్సు చూస్తే తెలుస్తుంది. దానికితోడు అనేక మంది సోషల్ వర్కర్సు కూడా వెళ్ళిపనిచేస్తూవుంటారు. అనేక మంది వ్యక్తులు, ఇతర సంస్థలు ఎంతో ఆర్థిక సహాయం చేసి వికలాంగులైన అభాగ్యుల భాగ్యోన్నత భవిష్యత్తుకు, యితోధికంగా సహాయం చెయ్యటం కూడ కద్దు.

మన మామూలు హాస్పటల్సుకు వీటికి ఎంతో తేడా యుంటుంది. వికలాంగతను బట్టి వైద్య విద్యా, వ్యాయామ శిక్షణ యివ్వటం జరుగుతూ వుంటుంది. ఉదాహరణకు సరిగా మాట్లాడలేని బిడ్డలను తీసుకొనండి. ఆ బిడ్డ తన భావాలను అక్షరముల ద్వారాగాని, అంకెల ద్వారాగాని తెలియపర్చటానికి అనుగుణ్యాగా పరికరాలు, ఆ పిల్లలను బట్టి ఏర్పాట్లుచేస్తూ యుంటారు. మన సాధారణ పాఠశాలలో వలె వారికి కూడా వ్యాయామ పోటీలుంటాయి. కొంత మంది పిల్లలు ఎన్నో సంవత్సరాలు వుండ వల్సివస్తుంది కూడ. వారందరికి వైద్య విద్యా సౌకర్యాలు కల్పించటమంటె ఎంత కష్టమో. ఎలాంటి బాధ్యతా యుతమైనదో ఊహించ వలసినదే గాని, చెప్పనలవిగాదు. అలాంటి అవ కాశములులేని, మన దేశపు విషయములో, అలా వికలాంగులైన పిల్లల బాధ్యతా, భారాన్ని పైన వేసుకొని, వారికి బ్రతుకు బాటలు నిర్మించి, మంచి వ్యక్తులుగా, తయారుచేయటం, ఎంత కష్టమో, ఎంత బాధ్యత అయినదో. ఈ కార్యక్రమానికి అనేక సంస్థల నుండి ఉన్న దానిలో ఒరులకొట్టి సహాయసానుభూతులు చూపే, దయాదాక్షిణ్యాలు కల వ్యక్తులు, ముందుకు రావటం. ఎంత అవసరమో, మాటలతో చెప్ప నవసరములేదు. —

సాధారణంగా విదేశాలలో బాల, వృద్ధుల పోషణాలయాలు, వైద్య కేంద్రాలు, విద్యా సంస్థలు, అందుబాటులోనే అన్ని విధాల సౌక ర్యాలు యుంటాయి. - ఆరోగ్య పరిస్థితులలో పరిశుభ్రంగా వుంటాయి.

ఈవ్యాసాన్ని ముగించేముందు అచ్చట సాంఘిక వ్యవస్థను గురించి కొద్దిలో చెప్తూతా- మానవుడు ఎచ్చటున్నా ఎక్కడున్నా అతని ప్రకృతి ఒక్కటే కాని, ఆర్థిక పరిస్థితి ఆలో చనలోను, సాంఘిక వ్యవస్థలోను ఎంతో మార్పును కలుగజేస్తుందనిపిస్తుంది. ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా, వాళ్ళకు మనకు ఎంతో తేడా యుందనే చెప్పాలి. పారిశ్రామిక విప్లవం తరువాత వాళ్ళు ఎంతముందుకు వెళ్లారో, వారి జీవిత వ్యవస్థ, ఎలా మారి పోయిందో, యిచ్చట చెప్పటం అనవసరం. కాని, వాళ్ళు యంత్రానికి మట్టుకు మనలో చాలా మంది అనుకునేవిధంగా బానిసలు కాలేదనిపిం చింది నాకు.

వాళ్ళవూళ్ళూ, యిళ్ళు వాకిళ్లు పచ్చనితోట లతో, వికసించిన పూలతో, అందాన్ని వెదజల్లి, ఆనంద హాయిలను గూర్చే పూల మళ్లతో ఎంతో శుభ్రంగా, సుందరంగా చూడసొంపుగా యుంటాయి. డబ్బు లేకపోయినా, శుభ్రంగా వుండవచ్చును గదా, అలాంటిదే మనలో లోపిస్తుందని చెప్పాలి. ఇంటి అలంకరణ విష యములోనైతేనేమి, ఉన్న దానిలో ఓపినట్టుగా ఖర్చుపెట్టుకొని, అనురాగ, ఆనంద, ఆరోగ్యా లతో బ్రతికే విషయాలలోనైతేనేమి, వారికి వారేసాటి అని చెప్పాలి. ఈనిముషం పోతే మరలరాదు. అందుబాటులో ఉన్న ఆనందాన్ని

జీవితాన్ని అవకాశం యున్నంతవరకు, అనుభ వించాలనే తాపత్రయం వాళ్లలో కన్పించుతూ వుంటాయి.

భిన్నత్వంలో, ఏకత్వానికి, మనము ఉదాహరణంకాని, అలాంటిది వాళ్ళలో కన్పించదు. భాషలో తప్పితే, కట్టుబొట్టు విషయములో నైతేనేమి, ఆహారపానీయాల విషయములో నైతేనేమి, ఆదేశాలలో మన దేశములో లాగా ఎక్కువ తేడా కన్పించదు. స్త్రీ పురుషునితో పాటు సమాన హక్కులు గలిగి యుండటం, ఉద్యోగంచేసి, కుటుంబానికి తోడ్పడుతూ వుండటం, చాలా మట్టుకు ఇంటిపనులు, భార్యా భర్త ఇద్దరూ కలిసి చేసుకుంటూయుండటం, మనం గమనించవలసిన విషయమే. అచ్చట చాలా మంది మొగవారు భోజనాలు అయిన పిదప ఎంగిలి పళ్ళాలు కడుగుతారు, అంటే మనదేశపు మొగ మహా వీరులకు ఎంత హాస్యాస్పదంగా వుంటుందో చెప్పనలవిగాదు. మనము కని విని ఎరుగనిది, మనము తెల్సుకొన గల్గినది, నిజం చెప్పాలంటె మనము వాళ్ళనుండి నేర్చుకొనతల్చినది 'డిగ్నిటి ఆఫ్ లేబరు'ను గూర్చి. మనం కొన్ని కొన్ని వృత్తులంటె అజ్ఞానంవల్ల నైతేనేమి, అహంకారము వల్ల నైతేమీ చాలా తేలికగా చూస్తాము. కాని అలాంటిది అచ్చట కన్పించదు. అన్ని వృత్తుల వారికి అచ్చట సమాన గౌరము యుంది.

వాళ్ళు ఎలాంటి యంత్ర యుగంలో ఎలా హాయిగా బ్రతుకుతున్నారో, ఒకటి రెండు విషయాలు మచ్చుకు చెబుతా. వాళ్ళకు పెద్ద పెద్ద కొన్ని అంతస్థుల షాపులుంటాయి. ఒక అంతస్థు నుండి యింకొక అంస్థుతకువెళ్ళటానికి పురాతన పద్ధతి మెట్లపైగాని, ఇచ్చట మనం చూసే కొన్ని కొన్ని మెలివేటర్సుగాని కాదు. వాటిని 'ఎక్సలేటర్సు' అంటారు. మెట్లు మెట్లుగా ఎప్పుడూ తిరుగుతూనే వుంటుంది. మనం ఎక్కి ఒక మెట్టుపై నిల్చుని దిగతల్చిన చోట దిగ వచ్చు. అచ్చట ప్రయాణాలు చెయ్యటం చాలా తేలిక. భూమాంతర్గత రైళ్ళ విషయం చూడ వల్సిందేగాని చెప్పవల్సినది గాదు. వాళ్ళు యితర ప్రాంత ప్రయాణీకులన్న, ఎంతో శ్రద్ధ తీసుకొని, టూరిస్టులకు ఎంతో సహాయపడుతూ వుంటారు. టూరిస్టుల వల్ల ఆదేశాలకు ఎంత డబ్బు వస్తుందో కూడ తెల్సుకొనవల్సిన విషయమే.

ఒకరి లోటుపాట్లు ఒకరు తెల్సుకొని చెడును వదలి మంచిని తీసుకొని సామరస్య భావ నలతో మెలగగలిగి సాంఘికంగా, వైజ్ఞానికంగా, ఎంతోముందుకు వెళ్ళిన ఈ 20 వ శతాబ్ధంలో, మారణ యంత్రాలకు బుద్ధి చెప్ప గల్గితే మానవాళి మహా దయానికి, మహోన్నతికి, ఎన్నో అపూర్వ అవకాశాలున్నాయి.



......

ఇంగ్లండులో స్త్రీల పత్రికలు

'వుమన్' అనే వార పత్రికను మూడ్పైలక్షలమంది చదువుతారు. 'వుమన్ అండ్ హోమ్' అనే మాస పత్రిక పదిలక్షలకుపైగా అమ్ముడవుతుంది.

-బ్రిటన్ · అఫిషియల్ హాండ్ బుక్-

# సత్యవతి స్వగతము

"ఇంతటితో ఈ కురువంశమంతరించవలసినదేనా! ఈ వంశమే అంతరిస్తే అరాజకము తప్పదు- అరాజకము వలన ప్రజలు ధర్మము తప్పిచరింతురు. ధర్మము పతనమైననాడు సకల అనర్థములు వాటిల్లునుకాదా! ఇప్పుడేమిటి కర్తవ్యము ? ఆహా ! ఈవంశమునకు యెంతటి దుర్గతిపట్టినది? శంతన మహారాజునకు భార్యనై ఉద్దండులగు పుత్రులను బడసితిని- కురువంశమును ఉద్ధరించితి ననుకొంటిని- నాయాశ చివరకు అడియాశయైపోయెనుకదా! విధివిలాసమిట్లు విపరీతముగా పరిణమించునని కలలోకూడ తలచి యుండలేదు- వంశము నిర్వంశమగునని తలంప లేదు- అయ్యో! చిత్రాంగదుడు అవివాహితుడుగనే మరణించినాడుకదా! విచిత్ర వీర్యునకు ఆ కాశీరాజు కూతుండ్రను వివాహము చేసితిని- ఇద్దరికిని సంతానము కలుగలేదు. విచిత్ర వీర్యునకు ఆ అంబికాంబాలికలయందు ఎంత మోహము! సకలవ్యాపారములు కట్టిపెట్టి- కామరాగాధికుడై- అబ్బ; అవిషాద గాథ తలచుకొన్న మనస్సు వికలమగుచున్నది- గుండె బరువెక్కుచున్నదే కాని కర్తవ్యము గోచరించుటలేదు- ఎంతటి రాజాధిరాజును చేపట్టిన నేమి ఫలము ? ఎంతటి సౌందర్యమున్న నేమి ఫలము ? విధిని దాటుటకు యేరికిని శక్యముగాదు కదా!

"నాసవతికుమారుడైన ఈ భీష్ముడైనను వివాహము చేసుకొని వంశమును ఉద్ధరించిన ఎంత బాగుండును? అతడీపనికి ఒప్పుకొనడు- చాల పట్టుదలగలమనిషి- హిమకరుడు చల్లదనమును, అగ్నిహోత్రుడు వేడిమిని ఆదిత్యుడు తేజమును, వదలిపెట్టుదురేమోకాని ఈ భీష్ముడు తన పట్టును సడలించడు కదా! ఏమి! కాసంత సడలింపరాదా ? నా పుత్రులకు రాజ్యాధికారము వచ్చుటకు కదా ఈతడు వివాహము మానుకొనినాడు ? ఇప్పుడు మొదటికే మోసము సంభవించినదే- చిత్రాంగదుడును, విచిత్రవీర్యుడును కూడ గతించిరే! ఈ వంశము నిర్వంశమగుటకు సిద్ధముగనున్నదే!- ఈ సమయమున తనకీ బ్రహ్మచర్య వ్రతమెందులకు ? కొంచము సడలింపకూడదా! ఇతడేమి ఇనుప కచ్చడాలు ధరించిన మునిపుంగవుడా ? మేరుగిరివంటి ధీశాలి విశ్వామిత్రుడు మేనక వద్ద కరగినీరైపోలేదా ? అంతయెందులకు ? నానిరుపమసౌందర్యమును తిలకించికదా వశిష్ఠుని పౌత్రుడు త్రిజగన్వినుతుడు పరాశరమునీంద్రుడు నాకన్యాత్వమునకు భంగము తలపెట్టినాడు? అతడేమి తక్కువవాడా? మహాతపస్సంపన్నుడు- నాయావనమునకు ముగ్ధుడై యెంతటిధీరుడు యెంతటిభీరువైనాడు ! నాకన్యాత్వమునకు భంగము కలుగునని యెంత ప్రాధేయ పడినను విన్నాడా ? భంగము కాకుండ వరమిచ్చి. పట్టపగటని గాఢాంధకార బంధురముగ చేసివైచిన ప్రజ్ఞాశాలి— మహిమాన్వితుడు- ప్రకృతినే వశపరచుకొగల ఆ ధీమంతునకు, మహాత్మునకు మన మొకలెక్కయా ? ఆ తేజోరాశికిపుట్టిన పుత్రుడెటువంటివాడు ? వేదమయుడు— అఖిలమునీంద్రులకు ఆద్యుడు— వేదవ్యాసుడై ప్రకాశించుచున్నాడు. ఆ, మంచిసమయమునకే జ్ఞప్తికి వచ్చినాడు— ఇప్పుడాతని చేతనే ఈ కురువంశము నుద్ధరింపజేతును-

శ్రీమతి జి. సుందరీశంకరం

ఎటులైన నా గర్భమందు పుట్టిన వానిచేతనే ఈ వంశము ఉద్ధరింప బడవలసియున్నది కాబోలు? అయిన నొక్కసారి భీష్మునితో ప్రస్తావించి చూతునా? ఇకనతనితో ప్రసంగింప వలసిన పని లేదు- సర్వజనులయెదుట తానుచేసిన ప్రతిజ్ఞను వీడననియు, క్షత్రియ క్షేత్రములయందు ఉత్తమ బ్రాహ్మణునివలన వంశాభివృద్ధి చేసుకొనుమనియు, అటులచేయుటయే ధర్మమనియు నుడివినాడు- నా వివాహసమయంలో తాను శుల్కార్థముగాచేసిన ప్రతిజ్ఞమాత్రము తప్పుట అసంభవమని నన్ను దెప్పిపొడిచినాడు- ఇంక నతనితో ప్రసంగించుట నిష్ప్రయోజనము... పాపము- ఒక్కొక్కప్పుడు అతనిని తలచుకొనిన జాలికూడకలుగును. నా వివాహ వేళను యెంతటి సాహసము చూపినాడు! ఎంతటి స్వార్థత్యాగము చేసినాడు! ఆ సంఘటనలు ఇంకను నాకండ్లకు కట్టినట్లుండును. అహర్నిశలు నన్నే- నా సౌందర్యమునే తలంచుచు రాచకార్యములను కూడ వీడి నిర్వ్యాపారుడైయున్న తండ్రియొద్దకువెళ్ళి విచారకారణమేమని అడిగినాడట— అప్పుడు శంతనమహారాజు ..

విసవయ్య-ఏకపుత్రుడు-అనపత్యుడు ఒక్క
రూప యనివిని ! నీకుదోడుగ పుత్రులను
అనఘా ! పడయంగ నిష్టమైనది నాకున్.

వినవయ్యా-ఏకపుత్రుడు-అనపత్యుడుఒక్క
రూప యనివిని ! నీకుదోడుగ పుత్రులను
అనఘా ! పడయంగ నిష్టమైనది నాకున్.

అనిచెప్పి పైగా అగ్నిహోత్రము, సంతానము వేదములు అవిచ్ఛిన్నముగా ఉంచవలెనను ధర్మమును సూచించి తాను బహుపుత్రార్థము యత్నముసేయ సంకల్పించినట్లుకూడ చెప్పినాడట— అంతటి అమాయకుడైన ఈ భీష్ముడు తండ్రి విచారకారణము తెలుసుకొని మా తండ్రి వద్దకు వచ్చుటయు, మా తండ్రిచెప్పిన మాటలును యింకను వీనులకు వినబడుచునే యున్నవి కదా!

"వినుడు ప్రసిద్ధులైన పృథివీపతులిందరున్
కురుప్రయోజనమున జేసితిన్ సమయ
సంస్థితి ఈ లతాంగికి ఉద్భవించిన
తనయుండె రాజ్యమును జేయగనర్హుడు
వాడె మాకు నెల్లరకు పతి వాడెకౌరవ
కులస్థితికారు డుదాగ సంపదన్"

అని సభాసదులెల్లరకు సంభ్రమాశ్చర్యములు కలుగునట్లుగా దేవవ్రతుడు పలికినాడు— అప్పటికీ మాతండ్రి దాశరాజు గడుసుదనముగా "నీ వఖిలధర్మవిదుడవు. గావున నీకిట్లుచేయగా దొరకొనియెన్! భావిభవత్సుతులిట్టిరె? నీ విహితస్థితి సలుపనేర్తురే యనినన్."

"ఈ మహానుభావుడు వెంటనే భూమ్యాకాశాది పంచభూతములు సాక్షిగా తానిక వివాహమే చేసుకొననియు, ఆజన్మాంత బ్రహ్మచర్య వ్రతదీక్ష గైకొనుచున్నాననియు ప్రతిజ్ఞచేసినాడు కదా! ఇట్టి ధీరోదాత్తుడు- సత్యవ్రతుడు- వంశము నిర్వంశమగు పరిస్థితులలో నైనను బ్రహ్మచర్యము వీడననియు, వివాహము చేసుకొననియు భీష్మించుకొని కూర్చుండుటలో ఆశ్చర్యములేదు- అతడు నుడివినట్లు నాగర్భవాసమున జనించిన కుమారులచే కురువంశాభివృద్ధి గాకపోయినను, నా గర్భమునజనించిన వేదవ్యాసునిచే ఈ కౌరవాన్వయము ఉద్ధరింపబడు గాక! నాయనా! కృష్ణద్వైపాయనా! ఎక్కడ నుంటివి?! ఎప్పుడు కావలసిన అప్పుడు ప్రత్యక్షమగుదునని పుట్టినతోడనే తపస్సునకు వెడలి పోయితివి- ఒక్కసారిరమ్మా! ఆది బ్రహ్మకు సరి సమానుడవగువిప్రుడవు - వేదవ్యాసుడవు- నీ చేతనే కురువంశము ప్రతిష్ఠింపబడవలసియున్నది. ఇంతకన్న నాకు కావలసినదేమున్నది?"

---

# వరాలచెట్టి

ఆకటికడుపుకు అన్నం అందించి సత్ప్రవర్తనకు
దారిచూపింది మహాయిల్లాలు డొక్కా సీతమ్మగారు.

శ్రీమతి దీదువాను బదరీనారాయణమ్మ

శ్రీమంతుని పుత్రుడు నివాసస్థలము బొంబాయి శ్రీమంతుని పుత్రులు సకల గారాబాలతో పెరుగుట లోకవిదితం. ఐతే చివరకదే ముప్పు తెచ్చేది తల్లిదండ్రుల తగని గారాబంచేత తదితరులు కూడా తగిన శిక్షణలో పెట్టడం కష్టసాధ్యంగా వుండేది. ప్రైవేటుమాష్టరు వచ్చేసరికి పాయఖానాలోనికి పారిపోతూ వుండేవాడు. పాపం! ఆ మాష్టరుగారికి విసుగెత్తి యీ పిల్లవానికి ఒ, న, మః, యైనా మప్పలేకపోయాను వారిచ్చే జీతానికి తగిన ప్రతిఫలం కనపర్చలేకపోతున్నానని ఒక రోజున భయంచెప్పడంకోసం యిట్టే వీపుమీద చెయివేసినాడు అంతే, హోరుహోరుమని తల్లివద్దకుపోయి మాష్టరుగారిమీద చాడీలు చెప్పాడు. తల్లికష్టేకష్టంతోచి, నా అపురూపపు బిడ్డపై ఆలా చేయి ఎత్తడానికి ఆమాష్టరుచేతులు ఏలావచ్చాయి; బంగారపు తూగుటుయ్యాలలో పట్టుపరుపులపై పండుకునే యీ సుకుమారునిపై ఆకరినమైన కాష్టంలాంటి కరాలు ఏలా సాగాయి. చదువులేకపోతే వాడికి గడవదా? అంది వాళ్ళ అమ్మ. యీ మాటలు గురువుగారి చెవిని పడ్డాయి. అంతే, మళ్ళీ ఆపౌధంవైపుచూడలేదు అభిమానస్థుడైన గురువు

మళ్ళీ యింకొక మాష్టరు ఛార్జిపుచ్చుకున్నాడు. వరాలచెట్టి అల్లరిచిల్లరపనులన్నీ కనిపెటాడు. శభాష్! బాగుందిరా- వాడు ఎల్లాపోతేనే, మన ఫీజుమనకు రెగ్యులరుగా ముడుతున్నప్పుడు అని, వరాలచెట్టి చేష్టలకు భళీ అంటూ వుండేవాడు పొగడుతున్నకొద్దీ ఫలహారాలు, కానుకలు ఎక్కువముడుతూవుండేవి. పొగపీల్చడం, పొడుంపీల్చడం, పానీయంచేయడం, పడచుల పమిటలు పట్టుకులాగడం, పైలాపచ్చీసుగా తిరగడం, పగటి కార్యక్రమం. చీకటిపడేసరికి చేతికేటులు కొట్టడం, చెలికాండ్రతోకలిసి జూదమాడడం, తుదకు తండ్రి ఇనప్పెట్టె తాళంచెవులు సహాసంగ్రహించడం, ఇనప్పెట్టెలోని ధనంతరుగుదలలోకి తేవడం మొదలుపెట్టాడు, వరాలచెట్టి. మాష్టరు పారం మాష్టరుదే, వీడి పారం వీడిదే. మాష్టరురాను, హాయిగా ఒక బల్లమీద గుర్రుపెట్టి నిద్రపోను. నెల అయేసరికి బరాబరీగా సొమ్ము ముడుతోంది. యీవిధంగా వరాలచెట్టి బాల్యం గడచిపోయి గృహస్థుఅయ్యాడు.

చిన్ననాడు చితుకులు ఏరితే పెద్దనాడు మరేవో ఏరాడన్న సామెత ప్రకారం, అబ్బాయి కొక గుదికర్రమెడకు కడితే చిలిపిచేష్టలు మానిస్థాయి పడతాడనుకున్నారు తల్లిదండ్రులు, కాని అతని చిలిపిచేష్టలకు డబుల్ఇంజన్ పోయ్సపట్టింది. ఏవీధికి వెళ్ళినా, "రావోయి మాయింటికీ, మామా! మాటున్నదీ మంచి మాటున్నదీ" అని పిలిచే ప్రేమికురాండ్రు ఎక్కువయ్యారు తండ్రిమీద తిరుగుబాటుచేశాడు; తండ్రితో పంచుకున్న సగంవాటా సానుల పరంచేశాడు. కట్టుకున్న భార్యను కడకుత్రోశాడు. మురిపాలమూటైన ముద్దుబిడ్డనుకూడా చూడ్డంమానేశాడు. సానిపొత్తే స్వర్గలోకం అనుకున్నాడు. సారాయిబుడ్డీయే సురాపానమనుకున్నాడు సంసారం విడిచిస్థిరసుఖం కోల్పోయి కపటసుఖాన్ని కాంక్షిస్తున్నాడు. పాపం, ఎన్నాళ్ళు బాధలు పడుతుంది భార్య? చంటిబిడ్డను చంకన పెట్టుకుని సానియింటికివెళ్ళి సురాపాన తీవ్రప్రేరిత చిన్ముద్రదీక్ష వహించిన భర్తనుచూచి బ్రతిమాలుతుంది యింటికి రమ్మని, ముద్దుబిడ్డని మురిపాలమోము చూచైనా మనస్సుమరల్చుకొనమంటుంది అందాలను చిందే ఆబిడ్డనిచూపులవైపు మీచూపులు త్రిప్పమంటుంది అస్పష్టయుతమైన జ్ఞాన్నజ్ఞాన్నా' అనుఆబిడ్డని అమృతపు మాటలలో, దా బాబూ! అనే ప్రేమపూరిత భాషలనూదమంటుంది. సురుచి భర్తయైన ఉత్తానపాద మహారాజు ధృవుని త్రోసిపుచ్చినట్లు నిరసించకుండా అర్థంచేసుకొని సునీతి భర్తయైన ఉత్తానపాదుడు ఉత్తముని ప్రేమగారబాలతో తన తొడ ఆచ్ఛాదనమిచ్చినట్లుగా మీరెండుతొడల మీద యీ బిడ్డనికి అచ్ఛాదన యిమ్మంటుంది. ఆమె అనేక దీనాలాపాలతో అతని మనస్సునుమరల్చుదామని ఎన్నెన్నైనా ప్రయత్నాలు చేస్తుంది. కాని "సహవాసయో దుష్టగుణాభవంతు" అన్నటు ఆమె సదో, ధనలాయన

చిమ్మచీకటిలో సణుగుగొణుగులలా వినపడ్డాయి; ఛా- ఛా- ఎవరవు నీవు? సానికొంపలకు సంసారి ఏలావస్తుంది. సిగ్గెందుకు లేకపోయింది. పో నీదారిని నీవు. అని కసిరాడు. సందు కనిపెట్టి సాని సాకులుచెప్పి వెళ్ళ కొట్టింది. శ్రీమంతుని బిడ్డ అయితేనేమి ఆమె శ్రీరేఖ లన్నీ అడ్డుతిరిగాయి, తుదకు భుక్తిగడవడం కూడాకష్టమై విసికివేసారి విధిని తలుస్తూ అత్తమామలను, చేరుకొంది. పాపం తలిదండ్రులుమాత్రం ఏంచేస్తారు? పసిప్రాయం పెట్టినపరిమితిలేని ప్రేమకు బదులుగా ప్రాబల్యమైన పగప్రాకిపోయింది, వారి హృదయాలలో! ఐతేఏంచేస్తారు? ప్రతీకారం చేసేదిలేక పశ్చాత్తాప హృదయులయినారు. పిల్లలను పెట్టుపోతలపట్ల ప్రేమ గానూ, ఆచరణలపట్ల శత్రువుగానూ చూచుకొనక పోవడం తల్లిదండ్రులదే తప్పనుకున్నారు! ప్రథమంలోని పంతులుగారు ప్రతిబింబించారు ఆమె దృష్టులలోకి!

"సుఖస్యానంతరం దుఃఖం! దుఃఖస్యానంతరం సుఖం" అన్నట్లు అల్లారుముద్దు బిడ్డ కష్టాల పాలైనాడు. ఒంటరితనంకనిపెట్టి వారాంగనలు ఒడికేశారు. యిక మిగిలినదియేముంది? అమ్మా బిచ్చం, అయ్యా బిచ్చంగా- మారింది. దైవసంకల్పం- పాదుషా ఫకీరుగాను, ఫకీరు పాదుషాగాను క్రిందుమీదులవడం జరుగుతూవుంటూంది! పాపం! వరాలచెట్టి మనస్సు వికలత చెంది, దేశ దేశాల ద్రిమ్మరిఅయ్యాడు. ఒక పూటతిని, ఒకపూట తినక దేశ దేశాలు తిరిగి తిరిగి ఆంధ్రదేశం చేరుకున్నాడు. అప్పటి రోజులలోఖ్యాతిఖండఖండాంతరాలుకూడాదాటినది. అపర అన్నపూర్ణదేవత అనీ డొక్కా-సీతమ్మగారూ అంటే ఏ భద్రాజునోటవిన్నా ఆమె అన్నదాన నిరతినిగురించేవిశేష పొగడ్తలే. ఆమెఖ్యాతి. వేనోళ్ళపొగడడానికి భాషామణికి కూడాఅలవికాకుండావుంది. వరాలచెట్టి చెవిలోపడ్డది ఆమె నిరతాన్నదాన ప్రఖ్యాతి. ఆకలిమంట ఆర్పుకోడానికి అదే తావనుకుని నదులు, నిధులుదాటి తూర్పుగోదావరి జిల్లా డొక్కా-వారి గన్నవరం చెరుకున్నాడు. అట్టే గచ్చు చప్టామీద చేర్చుకున్నాడు నడ్డి. "అమ్మా,! అన్నం"అని అడగడానికికూడా ఊపిరిలేదు. ఆమె హృదయం దయారసభరితం,మాటలుమధుతుల్యాలు,ప్రేమమాతృసమానం, లాలన పాలనలు నిష్కాపట్యాలు, ఓరిమికిధరాదేవి. నిశి రాత్రివేళనీరసించిన అవ్యక్తిని చూచి నీరుచల్లింది. అతని శ్రమ ఉపమించేదాకా, ఆకటి కడుపుకు అన్నం అందించి ఆత్మనుపశమింపచేసింది.ఆమెఆదరణ అతనికిస్వర్గతుల్యమైంది. అతని యిక్కట్టుల ప్రవాహంలో యిది యొక మంచిఘట్టమనిపించింది. యీలాకొంతకాలం గడుస్తోంది.

సత్రంభోజనం, మఠంనిద్ర అన్నట్లు డొక్కా-సీతమ్మ గారింట్లోభోజనం,పశువులశాలలోపడక. మంచిమార్గాలకు దుర్విఘ్నాలు చాలావుంటూవుండడం కద్దు. సదాచారాలు సులువుగా మరుస్తాం, కానీ దురాచారాలను త్రోసిపుచ్చడం తరంకాదు. ఉన్నట్లేవుండి అట్టే మనసు మళ్ళింది ఆ సారా బుడ్డీమీదికి! మన వరాలచెట్టికి, డబ్బెలా వస్తుంది? సీతమ్మగారు పెరట్లో ఆరేసుకున్న పట్టుచీర పట్టుకపారి పోవడం మొదలుపెట్టాడు. ఆమె కొడుకు లూరకుంటారా? అట్టే పట్టుకుని కట్టిపెట్టారు ఆ గచ్చుస్తంభానికి. ఆమెకీవార్త తెలిసి అధికంగా వ్యసనపడ్డది. అతని కట్లనువిప్పి కూర్చోబెట్టి, నాయనా! వరాలచెట్టి! ఆకటి కడుపు ఎన్నిపనులైనా చేయిస్తుంది, నీవు షాహుకారు బిడ్డవు. సుఖదుఃఖాలు సముద్రతరంగాల్లాంటివి. యిదిగో యీధనం తీసుకుని చిన్న వ్యాపారం మొదలు పెట్టుకో "దుఃఖానంతరం సుఖం" అన్నట్లు పడ్డగోడలు పడ్డట్లు వుండవు. పట్నాలు పల్లెలు, పల్లెలు పట్నాలు కాగలవు. అని ఆమాటఅందించింది. అవియే అతనికొక ఆదర్శ మార్గంఅయింది. ఆమెఓదార్పులేగురుప్రబోధనలయ్యాయి, ఆదినమేఅతనికొక సుదినమైంది. హృదయపశ్చాత్తాపంతో కృతజ్ఞత తెలుపుతూ సాష్టాంగపడ్డాడు ఆమె పాదాలకు. అతనికామె ఆధిష్టాన దేవత అయింది. అభయహస్తంతో అశీర్వదించిందామె చిరసుఖివి కమ్మని "సహవాసయోః పుణ్యగుణాభవంతు" అన్నట్లు, ఆనందభాష్పాలు జలజల రాలాయి— ఉభయుల నేత్రాల నుండీ, వరాలచెట్టి భాష్పాలతో ఆమె పాదప్రక్షాళనచేసాడు. ఆమె ఆనంద భాష్పాలతో అతని నభిషిక్తుని చేసింది-

ఊరివెలపలకి వెళ్ళి విప్పి చూసుకున్నాడా మూట. నూటపదహార్లు, స్వస్థానం చేరుకున్నాడు, చింతపండు మిరపకాయలతో చిన్న దుకాణం తెరచాడు, యిప్పుడు కొన్నాళ్ళవరకతను వందల కధికారి అన్నారు, దరిమిలా వేలకుఅధికారి అనివాడుకవచ్చింది. అతరువాతలక్షాధికారి అని ప్రతీతి అయింది, పైమీద కోటీశ్వరుడు అనిపించుకున్నాడు, భార్యను బిడ్డను తెచ్చుకునిపరమ సుఖమనుభవిస్తున్నాడు- కాని అతని హృదయానికొక చింత, భీతి, "అయ్యో, మాఅమ్మా, మానాన్నావుంటే సంతోషిద్దురు" కదా అని చింత; బాబో! నాకొడుకుకూడా నాలా అవడుకదా అని భీతి. ఏమైనాసరే తగినశిక్షణ యిచ్చే గురువుదగ్గర తరిఫీదుచేయాలితనకొడుకుని అనుకున్నాడు, తనలా కాకుండా! —

★

# హృదయార్పణ

"నివేదిత"

ఆ రోజు జూన్ ఇరవై రెండో తారీఖు ఉదకమండలం ప్రధానాధ్యాపిక నవనీతం డేవిడ్ అడ్మిషన్ల గొడవలతో మునిగి ఉన్నది. ఊపిరి సలపడానికి కూడా ఆమెకు వ్యవధిలేదు. గడియారం నాలుగున్నరగంటలు సూచించింది. అబ్బ! ఇంక అరగంటలో అంగడి కట్టి వేస్తామని నిట్టూర్పు వదలిందామె. కొంచెము కలిగిన వాళ్ళంతా దేశం నలుమూలలనుండి తమ పిల్లలను ఈ బడికి పంపుతారు. పిల్లలకు చక్కని వసతులున్నది. కాని ప్రతి సంవత్సరము రెండు వందలకు మించి కొత్తవారిని ప్రవేశించ నీయడంలేదు.

గబగబా ఆఫీసుగదిలోనికి ఖద్దరుపంచె, లాల్చీ ధరించిన పురుషుడు పద్నాలుగేండ్ల అమ్మాయిని, పదేండ్ల అబ్బాయిని వెంటబెట్టుకొని ప్రవేశించాడు. నేను ప్రధానాధ్యాపకను అర్జంటుగా చూడాలి — అని వచ్చిరావడంతో అన్నాడాయన వయసు ఏభైకి దగ్గరుంటాయి. జుట్టు తిలతండుల న్యాయంగా ఉన్నది.

నవనీతం వచ్చిన వ్యక్తిని నఖశిఖ పర్యంతము ఒకసారి చూసింది. వెంటనే ఆమె "ప్యూన్ టైము అవుతూంది కదా!" అని అన్నది. ఆమె ఆమాటను అనీ అనకముందే వచ్చిన వ్యక్తి,

క్షమించండి, నేనుమూడుగంటల బట్టి వాకిటబెంచి మీద కాచుకొనే ఉన్నాను. ప్యూను మహాశయుని ఆజ్ఞ కలుగలేదు. చివరకు పూజారి లేకుండానే, దేవుణ్ణే నరాసరి చూద్దామని ప్రవేశించాను. ఇది మీ చట్టానికి విరోధమైనాసరే నాముక్కలు రెండు వినాలిఅన్నాడు.

నవనీతం ఏమీ మాట్లాడలేక పోయినది. ఆయన కండ్లు తనకు పరిచితాలన్నట్లేదో చెప్పింది. కూర్చోమని సంజ్ఞచేసింది,

ఇంతలో ప్యూను వచ్చి—అ ... ఇంద ఆంధ్రా, ఎన్నమ్మా. నుళంజుట్టాంగళే! నీంగ యారెయుం ఉళ్ళే విడాదింగన్ను సొన్నీంగళే ఎన్న ఎదుకు వెచ్చియింగ? —(ఆ ఈ ఆంధ్రుడు మారేశాడే! మిరు ఎవరినీ వదలవద్దన్నారని బయట కూలవేసాను")

సుమ్మా ఇరుప్పా ఉన్ వేలే పాతుకో — అన్నది నవనీతం (ఊరికే ఉండు; నీపని చూచుకో) అని-

ప్యూన్ కిక్కురు మనకుండా బయటికి వెళ్ళాడు.

వచ్చిన వ్యక్తి ప్రారంభించాడు

అమ్మా! ఈ పిల్లలను మీరు తప్పక ఎడ్మిట్ చేసుకోవాలి, అమ్మాయిధర్డుఫారం ప్యాసయినది మద్రాస్ గుడ్ షెపర్డ్ కాన్వెంటులో. ఇదిగో సర్టిఫికేటు. అబ్బాయి అక్కడే రెండవతరగతి ప్యాసయినాడు. అని సర్టిఫికేట్లు బయటికి తీశాడు.

అదిసరేనండి మీరుముందుగానే అప్లైచేయాల్సింది. ఇప్పుడు వెంటనే ఆడ్మిట్ చేసుకోడానికి వీలు లేదండి" అనింది అధికార ధోరణిలో నవనీతం.

వచ్చిన వ్యక్తికి ఆమెగొంతు పరిచితంగా విన్పించింది ఎక్కడ ఏమాఆని యోచన చేయకముందే లావెక్కిన నవనీతంలో అతనికి 'పద్దెనిమిదేళ్ళనాటి పదహారేళ్ళ నారాయణి గోచరించింది. అయినా వచ్చిన కార్యాన్ని ఉద్దేశించినట్లు:

---

కావ్యంలోని సుఖాంతం జీవితంలో సాధ్యమౌతుందా?

"మీరు అలా అనడానికివీలులేదు. ఎలాగైనాసరే వీలును కల్పించాలి. తల్లిలేని పిల్లలు, వారంరోజులక్రితమే నాభార్యపోయింది ఇంట్లోఉంటే వాళ్ళకదే ధ్యాస పైగామరీచిన్న పిల్లలైతే అసలుగుర్తే ఉండదు చిక్కులేదు, పెద్ద వాళ్ళయితే వీధికి తలబగ్గి ఊరుకుంటారు. రెండూకానివయసు, ఇక్కడైతే నలుగురు పిల్లలతో"మరచిపోయి గడపకలుగుతారు.

మద్రాసులోనే గుడ్ షెపర్డ్ కాన్వెంటులోనే ఉంచలేకపోయారా? అక్కడ బోర్డింగ్ ఫెసిలిటీలు ఉన్నాయనుకుంటాను."

"క్షమించండి నాకిక్కడికి మార్పు వచ్చింది ఈ పిల్లలను వదలి నేనుండలేను ముమ్ముందు నిర్మించబోయే కుందాప్రాజెక్టును సర్వేచేయడానికి వచ్చాను కాబట్టి ఇక్కడే వీళ్ళను చేర్చవలెనని నిశ్చయించాను"

"మీరు నిశ్చయించారుసరే, మాకు వీలుండవద్దూ?"

"మీరుఊరికే నాతోహాస్యాలాడుతున్నారు. హెడ్ మిస్ట్రెస్ తలచుకుంటే ఇద్దఋ పిల్లలకు చోటు లేకపోతుందా? — ఇకవాళ్ళు మీ పిల్లలే. మీ ఇష్టము. అన్నాడు నవ్వుతూ వచ్చిన వ్యక్తి.

నవనీతం తికమక పడింది. పిల్లలను ఎగా దిగా చూచింది, పావడా వోణీ వేసుకున్న అమ్మాయి నళిని తండ్రిని మూడుమూర్తులా పోలినది. ఏదో ఆ పిల్ల మీద నవనీతానికాక్షణమే అభిమానం ఏర్పడినట్లైనది.

అమ్మాయిని అడ్మిటు చేసుకుంటాను, డబ్బు కట్టవచ్చు. అరుకొట్టితే కాషియర్ వెడ్తుంది. వెళ్ళి కట్టండి." అన్నది నవనీతం.

"రఘుఅసలు అక్కనువదలిఉండలేడు"భగవంతుడు సరే వాళ్ళపట్ల నిర్దయచూపాడు. మీరైనా ..." అన్నాడా ఇంజనీరు.

"ఉండవయ్యా నీకుఇతరుల దృష్టికోణంలో చూసే శక్తిలేదా? చిన్నక్లాసు లిప్పటికే ఓవర్ క్రౌడెడ్. ఉండండి. కనుక్కుంటాను"అని ఫోనుతీసి ఎవరితోనో మాట్లాడిందామె.

"మూడో తరగతిలో అసలు చోటులేదు. మళ్ళా రెండవ తరగతి చదుతావా అబ్బాయీ" అన్నది నవనీతం కుఱ్ఱవాణ్ణి చూచి.

వాడు తాటి దన్నేవాణ్ణి తలదన్నేటట్లు "నో ప్లీస్ ఫోర్తు క్లాసులో చేరుతానండి. కష్టపడి చదువుతా" నన్నాడు.

నవనీతానికి ఆశ్చర్యం వేసింది. "సరే రేపుపిల్లలను తీసికొని రండి, ఇప్పుడే ఫీజుకట్టి వేయండి." అని గబగబా గదివదలి వెళ్ళింది, ఇంజనీరు శివరామశాస్త్రికి ఆమె నడకలో కూడ నారాయణి కన్పించింది.

జీతంకట్టి వచ్చినపని ఒకరకంగా విజయవంతమైనందుకు హర్షిస్తూ అప్పుడు నారాయణి కూడ అంతా మొదట నన్నేడిపించి తర్వాత బ్రతిమాలుకునేది. అనుకున్నాడు. అప్రయత్నంగా "నారాయణీ" అన్న మాటలు నళిని చెవిలో పడ్డాయి. ఎవరు నాన్నా నారాయణి?

మీ అమ్మలే—

"పో "నాన్నా అమ్మ పేరు కమలమ్మకదూ !"

"చిన్నప్పుడు నారాయణి అనేవారులే అమ్మా" అని కప్పిపుచ్చాడు తండ్రి.

కుఱ్ఱవాడు రఘు గెంతుతూ నాన్నా హెడ్ మిస్ట్రెస్ చాలా మంచిదేం. కదే నళినీ? నన్ను ఫోర్తుక్లాసులో చేర్చుకుంది" అన్నాడు.

చేరినట్లుకాదు. మొద్దబ్బాయిలాగుంటే చెవులు కందిపోతాయి. అన్నది నళిని.

చూద్దాములేవే ఫస్టుమార్కు తేకపోతే చూడు.

శివరామశాస్త్రికి వింతగా ఉంది. వారంరోజుల ఒట్టి ఏడుపుతప్ప ఏమీ ఎఱుగని పిల్లలు ఉల్లాసంగా మాటలాడుకోడం హాయినే చేకూర్చింది.

నవనీతండేవిడ్ హాస్టలులోని తనగది తలుపు తెరచి హాండ్ బాగ్ మేజామీద పడేసి ఈజీ చైరులో దేహాన్ని జారవేసింది సాయంకాలం తాను కలుసుకొన్న వ్యక్తి తన శాస్త్రి అని ఆమె హృదయముద్ఘోషించింది తన జీవితగ్రంథంలోని ఇరవై పుటలను వెనకకు త్రిప్పినది ఆమె. మనసులో ఇరవై ఏండ్ల సంఘటన లొకటివెంట నొకటి మెరువ సాగాయి.

నెల్లూరి మండలంలోని ఉదయగిరి ఆమె జన్మస్థలం. శ్రీ కృష్ణదేవరాయలు వశపరచుకొన్నాడని చరిత్ర తెలియజేసేద్ది ఆఉదయగిరిదుర్గమే. ఇరవయ్యో శతాబ్ధిలో దాని మహత్వమంతా శిధిల సౌందర్యమే. గ్రామమునసబు వీరబ్రహ్మంగారి పుత్రిక నారాయణి. అవూరికరణం సుబ్బావధాన్లకొడుకు కే. శివరామశాస్త్రి. చిన్నప్పుడు అవూరి ఎలిమెంటరీ స్కూల్లో నాలుగో తరగతి చదువు తున్నప్పుడు నారాయణిని ఒకటోక్లాసులో చేర్చారు. శివరామశాస్త్రి అక్షరాలు అచ్చుగుద్దినట్లుండేవి. నారాయణి, శాస్త్రి లాగుపట్టి లాగి తన పలకమీద వ్రాయమనేది. "అయ్యవారి అక్షరాలేమీ బాగుండవు. శాస్త్రి వ్రాస్తేనే నేను దిద్దుతానని"నని మారాము చేసేది. శాస్త్రికి నారాయణితో ఆడుకోడం సరదా. కారణం అతనికి ఇంట్లో చెల్లెళ్ళు లేకపోవడం ఒకటిను, రెండవది నారాయణి చురుకుగా మాట్లాడేది.

శాస్త్రి తండ్రి సనాతనుడు కుఱ్ఱవాడికి క్రాప్ అనవసరం అని జుట్టుంచినాడు. ఒకనాడు నారాయణి ఇన్ని పువ్వులు పట్టుకొచ్చి పెట్టుకోమని శాస్త్రి కిచ్చింది. "అబ్బే, నేను మొగవాణ్ణి పెట్టుకోను" అన్నాడు శాస్త్రి. అయితేక్రాప్ పెట్టుకో అంది నారాయణి.

శాస్త్రి మర్నాడు నాన్నతో చెప్పకుండానే క్రాప్ చేయించుకొన్నాడు. ఉన్నఊళ్లోనేమిడిల్ స్కూలులో ఎనిమిది తరగతులు ముగించి ప్రక్క ఊరిలో ఉన్న హైస్కూల్లో చదువు తున్నాడు, శాస్త్రి.

నారాయణి మిడిల్ స్కూలుకువచ్చింది. అప్పుడే వీరబ్రహ్మంగారు కూతురికి పెళ్ళిప్రయత్నాలుచేయడం మొదలు పెట్టారు.

నారాయణికి శాస్త్రి సంబంధము తనవాళ్ళెందుకనుకోడంలేదో అర్థమైనది. వాళ్ళది వేరేశాఖ అట.

శాస్త్రి పైచదువుకు నెల్లూరికి వెళ్తాడనితెలిసింది. సెలవులకు ఉదయగిరికి వచ్చినప్పుడు అతనికి నారాయణిని చూడాలనిపించింది. కాని పూర్వంలా ఎక్కడబత్తే అక్కడ ఆమె కనిపించడంలేదు. "కచ్చామిఠా" అనే మాంమిడికాయలు ఆమెకు చాల ఇష్టమని చెట్టెక్కి ఒడినిండా కోసుకొని దిగుతున్నాడు శాస్త్రి. కుక్కను వెంటబెట్టుకుని మామిడి తోపు అడ్డదారిని తిప్పమీదికి వెళ్తున్నది నారాయణి. చెట్టుమీద నుంచి చూచాడు శాస్త్రి ఆమె నారాయణే. చెంబూనీళ్ళూ ఆమె.

ఒక్క గెంతుతో ఆమె ముందు నిలబడ్డాడు.

"బుద్ధిలేదూ ఆడవాళ్ళు చెంబట్టుకొని వెళ్తుంటే అడ్డంగా వచ్చి నిలబడ్డావే"అన్నది కటువుగా ఆమె.

అప్పుడే పెద్ద ఆడదానివై పోయావా?- నీవు నాదానివేగా అన్నాడు కొంటెగా శాస్త్రి.

నారాయణి ముఖంలో క్రోధం శోకంగా మారి పోయింది. అయినా ఈ ఆడపిల్లలు ఎంత తొందరగా పెద్దతనాన్ని తెచ్చిపెట్టుకుంటారనుకున్నాడు శాస్త్రి.

నారాయణి కండ్లు చెరువులుగా మారడం చూచి శాస్త్రికి జాలివేసింది. చుట్టుపట్ల ఎవరూలేరు. అస్త్రాద్రిని చేరుకోబోతున్న సూర్యుడు త్వరత్వరగా భూమికి బంగారుపూత పూస్తున్నాడు. శాస్త్రి నారాయణి చేతిలో చెంబూ తాను తీసుకున్నాడు. మామిడి తోపునకు వెనుక చీపురు పుల్లలడొంక. దాని తర్వాత తిప్ప. ఇద్దఱు ఆ చీపురుడొంకలో నడుస్తున్నారు.

నారాయణీ! నవ్వు చూద్దాము-నాహృదయాన్ని నీకర్పిస్తాను. నా హృదయానికి నవనీతానివి నీవు. నీ కిదిగో ఒక పద్యం వినిపిస్తాను విను అన్నాడు. చీపురుపుల్లలు గాలికికదిలి వాళ్ళమీద పడుతున్నాయి కుక్క మూరంగా పరుగెత్తుతున్నది.

సీస పద్యాన్ని చక్కని తేటగీతితో జోడించి [illegible]

హృదయార్పణం అనే కావ్యాన్నిగూడ వ్రాస్తున్నాను. నీవే దానికి నాయికవు. నేను నాయకుడను తెలుసా నిజమా! అన్నట్లు నారాయణి శాస్త్రివైపు చూచింది. ఆ చూపులో తృప్తి, ఆనందం! ఆశ్చర్యం సమ్మిళితములైయున్నాయి.

డొంకదాటినారు. తిప్పనెక్కి ఒక వెచ్చని బండ మీద కూర్చున్నారు. నారాయణి తాను వచ్చినపని మరిచి పోయింది. చెంబులో నీళ్ళుతీసి ఆ వెచ్చనిబండ మీద ముగ్గులు పెట్టుతూ.

"శాస్త్రీ! కావ్యం సూత్రమే వ్రాస్తావా-నిజంగా నీ హృదయాన్ని నాకిస్తావా?" "ఇస్తాను దేవీ! కాని ఖాళీగా నేను బ్రతకలేను. నీ హృదయం ఆ స్థానే ప్రతిష్ఠిస్తావా?

తప్పక ఆ నిజంగానా. కానీ .... శాస్త్రీ! నేను హృదయం లేకుండా బ్రతకగలను. నా హృదయం ఇదిగో నీకిస్తున్నానని చెంబులో నీళ్ళు అతని చేతిలో పోసింది.

శాస్త్రి నవ్వాడు. తంత్రమునరే జరిపావు. ధార పోశావు. మంత్రమువది? పురోహితుడు ఎవ్వరులేరే?

మౌనమే మంత్రం, జగత్సాక్షి ఈ సూర్యుడే పురోహితుడు."

శాస్త్రి నారాయణి కండ్లలోకిచూచాడు. నాలుగు కండ్లదృష్టి రెండైనది,

ఇంతలో కుక్క "గౌ గౌ"అని మొఱగడం వినిపించింది. శాస్త్రి మెల్లగా జారుకున్నాడు. నారాణియ తండ్రి వీర బ్రహ్మంగారే వచ్చారు. "వెధవ కుక్క! కొత్తవాళ్ళను చూచినట్లు మొరుగుతుందేమిటి"అంటూ

"ఏమిటి అమ్మాయి ఎంతసేపే శంకుసార్థం. అయినా ఇంతదూరం రాగూడదమ్మా"అన్నాడు.

మారు మాటలేకుండా ఆయన వెంబడి ఇంటికి వెళ్ళింది నారాయణి.

వైశాఖ మాసంలో నారాయణిని అడగకుండానే ఆమెకు వివాహమైపోయింది. దక్షిణాది సంబంధమని అమ్మవైపు చుట్టాలని అన్నారు. చెంగల్పట్టు ఆమె అత్తగారిల్లు.

శివరామశాస్త్రి ఆమెను ఏకాంతంలో కలుసుకో ... సిలిలా అటు ఇటు తిరిగాడు. పీలులేక పోయింది. అసలు తన ముఖం అతనికి చూపడం ఇష్టము లేకపోయింది.

నారాయణి అత్తగారింటివారు ఆమె తలిదండ్రులను పీల్చిడబ్బు అడగడం ఆమెకెంతో బాధగా ఉన్నది. పైగా ఆమె ఆ భర్తతో మనసిచ్చి మాట్లాడలేకపోయింది. ముఖప్రీతి మాటలు మాట్లాడడం, ముఖంవెనుక మెటికలు విరవడం ఆ యింట్లో వారికి అలవాటు. నారాయణి భర్త నరసింహం గుఱ్ఱపు రేసులలో ఆనందాన్ని అన్వేషించ సాగాడు. అయనకు భార్య ఒకమనిషిక్రింద లెక్కకాదు.

రెండేండ్లు దొర్లాయి. ఉదయగిరిలో కలరా వ్యాపించిందని తెలిసింది. అది ఊరినే ఊడ్చినదన్నారు. నారాయణి తలి దండ్రులాఊడ్పు కాహుతైనారనీ తెలిసింది.

ఇంతలో చెంగల్పట్టులో ఒక్క క్రైస్తవ యువతితో నారాయణికి స్నేహంయేర్పడింది. ఆమె జీవిత గాథను విని ఆ యువతి స్కాట్లాండు మిషనరీ దగ్గిరికి ఆమెను తీసుకొని వెళ్లింది. నారాయణికా మిషనరీ మాటలు అమృతాల్లాగున్నాయి. భర్తకు ఇంటికి ఒక మునక వేసింది? ఆమె క్రిస్టియన్మతం స్వీకరించింది. ఆ మిషనరీ సహాయంతో తన తండ్రి ఇల్లు, పొలం అమ్మించి దానితో చదువుకున్నది. ఆమె ఎం. ఏ ప్యాసయింది శాస్త్రిని ఆమె మరువలేకపోయింది. గత జీవితమంతా అమెకొక పాడుకల. కాని శాస్త్రిని గూర్చిన ఊహా ఒకమధురభావం. భర్త అని పేరు పెట్టుకొని ఆమెను నానా బాధలు పెట్టిన వ్యక్తి, అతని చుట్టాలు పక్కాలు ఎప్పుడైనా జ్ఞాపకం వస్తే ఆమె అదరిపడేది. ఆమె చదువంతా చెన్నపట్నంలోనే జరిగింది. అమె, విధి వల్ల, సమాజపు సంకుచిత కట్టుబాట్లవల్ల మూఢ నమ్మకాల వల్ల భగ్నజీవులైన స్త్రీలనుద్ధరించి శేష జీవితాన్ని గడుపుకుందామనుకున్నది. శాస్త్రి కడపటి సమాగమమప్పుడు పలికిన నాహృదయ నవనీతానివి నీవన్నమాటలామె చెవుల్లో ఎప్పుడూ మ్రోగుతుండేవి. అందుకే ఆమె మతం మార్పుతోపాటు పేరు మార్చుకుంటూ "నవనీతం" అనే పేరు ఏరుకుంది.

చదువు పూర్తికాగానే ఆమెను నీలగిరి స్కూలుకు మొదట అసిస్టెంటుగాపంపారు. అక్కడే ఆమెడేవిడ్ గారినికలుసుకుంది. అయనతల్లి స్కాటిష్వనిత. తండ్రి

భారతీయుడు. ఆయన నవనీతానికి అన్నివిధాల తన చేదోడు వాదోడుగా ఉంటూ మంచి వల్ల ఆమెను ముగ్ధురాలిని చేసి చివరకు తన్ను వివాహం చేసుకో మని కోరాడు. నవనీతం నిరాకరించింది. తన గత జీవితాన్నిగూర్చి చెప్పింది. డేవిడ్ గారు మానవుడెప్పు డూపవిత్రుడే అని గత జీవింతతో అతనికి అవసరం లేదని ఆమె క్రైస్తవ మతం స్వీకరించిన దాది ఆద ర్శప్రాయంగా ఉన్నదని అదే తనకు తృప్తికరమనిచెప్పి నాడు.

నవనీతం శాస్త్రిని తలచుకొనేది. కాని ఇంకా శాస్త్రి అవివాహితుడా? అవివాహితుడైనా ఒకసారి వివాహమై, భర్త వదలివేసిన, మతంకోల్పోయిన తన్ను వివాహ మాడుతాడా? మగవాళ్ళ మాటలు మంచినీళ్ళ మాటలు అని పదేపదే ఆమె అంతర్వాణి చెప్పినట్లనిపించేది. వెంటనే వ్యక్తులనని లాభమేమి? శాస్త్రి పరిస్థితిలో తానుంటే తానేమి చేసియుండ గలదు? అని మళ్ళా సరిపుచ్చుకొంది

చివరకు డేవిడ్‌గారితో నాకు ఒంటరిగానే ఉండా లని ఉన్నదని చెప్పింది. కాని వదలిపెట్టే రకంగాలేదు వివాహము చేసుకోవాలని లేకుంటే (నన్‌గా) సన్యా సిగానైనా కావాలని, లేకపోతే లక్ష్య రహితమైన జీవితం భగవంతుడు ఏసుక్రీస్తుకు తృప్తికరము గాదని తానుచెప్పడమేకాక, పెద్ద పెద్ద మిషనరీలతో చెప్పిం చడం మొదలు పెట్టాడు.

పైగా ఆస్కూల్లో అతనిదే అంతా పెత్తనము, నీలగిరిలోని కొన్ని ప్లాంటేషన్లకు అతను సొంత దారుడు. స్కూలు హెడ్‌మాస్టరు. ప్రతివిషయానికి నవనీతానికి అతనిదగ్గరికి వెళ్ళక తప్పినదికాదు. డేవిడ్‌కు ఏభైఐదేండ్లుంటాయి. అతను వివాహమే చేసుకోదలచు కుంటే వధువులకు కొఱవ ఉండేదికాదు ఇన్నిరోజులూ ఒంటరి జీవితాన్ని ప్రశంసించే డేవిడ్ ఆమెను చూచినప్పటి నుండీ వివాహ జీవితాన్ని ప్రశంసించడం ఒంటరి జీవితం చిన్నపరులాంటిదని, ఎండాకాలంలోవట్టిపోయే కాలవలాంటిదేననీ రెండు జీవితాలు పెనవేసుకొన్నప్పుడు ఎండిపోనిప్రవాహమై త్రుళ్ళింతలాడుతూ ప్రవహించి జీవితధ్యేయము సుగ మముఅవుతుందనీ ఆయన ఉపన్యాసాలివ్వడం అతన్నె రిగిన వారికందరికీ కూడా ఆశ్చర్యం కలిగించింది.

ఏదేమైనా పరిస్థితుల ప్రభావమనండి, అవసరాల వత్తిడనండి, కుమారి నవనీతం, శ్రీమతి డేవిడ్‌గా మారిపోయింది.

ఎక్కడికెళ్ళినా మననీడ మనవెంబడే వస్తుందన డం నిజం. వివాహం కాకముందు మంచితనానికి పరాకాష్ఠగా కనిపించిన డేవిడ్‌గారిపైన నవనీతానికి రోజులు గడవను గడవను అసహ్యంకలగడం మొదలు పెట్టింది.

మొదటిది ఆమెకతని భోజనపద్ధతులు గిట్టేవి కావు. తండ్రి భారతీయుడైన, డేవిడ్ తల్లిప్రభావమే ఎక్కువగా నుండినందున మాంసం అతనికి చాలా ముఖ్యం. ఆవుమాంసం దినము తప్పకుండతినడం నవ నీతానికి బాధగా ఉండేది. ఉండబట్టక ఆవుమాంసం తినవద్దని ఒకసారి ఆమెఅనగానే డేవిడ్ ఉగ్ర మూర్తియై- ఓహో నీవింకా హిందువే నన్నమాట, నానాబాధలూ పెట్టి నిన్నునలిచివేసిన ఆమతంమీదనే నీకెంత అభిమానము! నిన్నింతచేసినవారిపట్ల కృతజ్ఞత లేని కృతఘ్నురాలా అని త్రాగినమత్తులో కేకలు వేసాడు. నవనీతం హృదయం పాషాణంగా మారి పోయింది. లోకమంతా మోసగాండ్రే అనుకుంది. ఆక్షణంనుంచి ఆమె డేవిడ్‌నుగూర్చి పట్టించుకోవడం లేదు. బైబిలుతో భగవద్గీతకూడ ఆమె మేజామీదికి చేరింది. విరక్తిభావం ఆమెలో ప్రవేశించి బాధను అణచి వేసింది. డేవిడ్‌గారికి వేటఇష్టము అప్పు డప్పుడు తుపాకి పట్టుకొని నీలగిరి కొండసానువుల్లో కుందేళ్ళను, జింకలను వేటాడేవాడు.

ఒక ఆదివారంనాడు అలాగేవేటకని వెళ్ళినడేవిడ్ గారిని మధ్యాహ్నానికి శవంగా తీసికొని వచ్చారు. అకస్మాత్తుగా తుపాకిలోని గుండ్లుపేలి అతనిప్రాణాలే తీసాయి.

నవనీతం అంతగా బాధపడలేదు! దేనికీ తాను కారణం కాదు. ఎలాజరగదలచి ఉన్నదో అలాజరుగు తుందన్న నిశ్చయంతో నిర్లిప్తభావంతో తన కర్త వ్యాన్ని నిర్వర్తించిందామె.

డేవిడ్ మరణానంతరం ఆస్కూలుకు, ఎస్టేటుకు నవనీతం అధికారిణి అయినది. కాని ఆమెలో అంతా శూన్యముగానే ఉన్నది. ఒక్కొక్కప్పుడు అనుకునే దామె !- హృదయమేనాడో నే నింకొకరికిచ్చాను. కాబట్టి అంతా ఒట్టిశూన్యముగా గోచరించడంలో ఆశ్చర్యమేముందని జీవితం యంత్రవత్ గడచి పోతున్న

ఏళ్లు గడచేకొద్దీ మనిషిలోనూ మార్పు వచ్చింది, నవనీతం లావెక్కింది, ముఖం ముడతలుపడనారం భించింది.

కాని ఈనాడు ఆపిల్లలతండ్రిని చూచిన క్షణం నుంచీ హృదయంలో కల్లోలం "ఆయన శాస్త్రీనా" అని ప్రశ్నించింది. బుద్ధి! "సందేహం లేదని" మనస్సు జవాబు చెప్పింది!

అర్థంకాని అశ్రువులు ఆమెచెక్కిళ్ళమీద ప్రవహించాయి, తాను ఎందుకు ఏడుస్తూంది, తనకేమి కావాలి?

భోజనం గంటకొట్టింది. గదిలోనే ఆమెకు భోజనం తెచ్చిపెట్టే అలవాటు - డేవిడ్ చనిపోయిన తర్వాత తమ బంగళా అద్దెకిచ్చి అమె హాస్టలులో ఒక గదిలో ఉంటూఉన్నది, భోజనం తెచ్చిపెట్టే సర్వరు మిగిలిన అధ్యాపికలంతా ఆమెసాయంకాలం సర్వీసుకు చర్చికి రాలేదని విచారించారని ఇలా ఎప్పుడూ జరుగలేదని ఆరోగ్యం బాగలేదేమోనని భయపడ్డారనీ తెలియజేశాడు.

నవనీతాని కప్పుడుగుర్తుకువచ్చింది తాను సాయంకాలం సర్వీసుకు వెళ్ళలేదని "ఆ ఆరోగ్యం బాగలేదు జ్వరం వచ్చినట్లున్నది" అన్నది మెల్లగా,

డాక్టరుకు ఫోను చేసింది. ఆమెవచ్చి ఏమీలేదు. రెస్టుతీసుకోమనింది,

ఆ రాత్రంతా నవనీతానికి నిద్రలేదు, గడియారం టిక్ టిక్ లు, గంటల మ్రోతలు వినిపిస్తూనే ఉన్నాయి ఎంత జ్ఞాపకం తెచ్చుకుందామన్నా డేవిడ్ జ్ఞాపకం రావడంలేదు. తన స్నేహితురాళ్ళ పేర్లు క్లాసు మేట్ల పేర్లు గూడా ఎంత గుర్తుకు తెచ్చుకున్నా గుర్తుకు రాలేదు, కాని ఎంత మరిచిపోదామన్నా సాయం సంఘటనా ఉదయగిరిలోని బాల్యము మరపునకు రావడములేదు. తనమీదే తనకు కోపం వచ్చింది. లేచి కూర్చొని బైబిలు తెరచింది అ అక్షరాలన్నీ అర్థంలేని పిచ్చిగీతలలా కనిపించాయి !

మళ్ళీవచ్చి పడుకుంది"ప్రేమమేపెన్నిధి, ప్రేమమే శాంతి, ప్రేమమే భువితారకమూ"అని ఆమెహృదయ కోకిలజోలపాటపాడిజోకొట్టినది, తెల్లవారుఝామున ఈమాటలను ఉచ్చరించుకుంటూ ఆమెనిద్రపోయింది, కిటికీగుండా వెచ్చని సూర్యకిరణాలు ముచంమీద సుకు రానందునబెంగపడి అక్కడహాస్టలులోని అధ్యాపికలు ఆమెమ వెదుక్కుంటూ వచ్చారు. కిటికీగుండా అమెమైమరచి నిద్రించడంచూచి "పాపం డేవిడ్ గారి వియోగంతో సతమత మవుతున్న"దని అనుకున్నా రా అమాయకులు,

పదిగంటలకు లేచి, గబ గబ కాలకృత్యాలు నిర్వర్తించి స్కూలుకు వెళ్ళింది నవనీతం-కాళ్లెందుకో తడబడుతున్నాయి. ఆఫీసు గది దగ్గర శాస్త్రిగారు పిల్లలతో నిలబడి ఉన్నారు.

ఫ్యూనుకు అడ్మిషన్ కార్డుఅందించి. పిల్లలను ఆయా క్లాసులకు తీసుకెళ్ళమని ఆజ్ఞాపించి హెడ్ మిస్ట్రెస్ నవనీతం శాస్త్రిగారిని లోపలికివచ్చి, కుర్చీ చూపి కూచోమనింది,

శాస్త్రిగారు మెల్లగా "తమదేవూరండీ అని సంభాషణ ప్రారంభించాడు.

నవనీతం "మీ పేరేమండీ"అని ఆరంభించింది.

శివరామశాస్త్రి అనిచెప్పి దాదాపు ఇరవై యేళ్ళ క్రిందట ఉదయగిరి వదలిపెట్టానని తండ్రి మరణించాడని ఇంజనీరింగుకాలేజిలో చదివి ఆకాలేజీ ప్రిన్సిపాల్ కూతుర్ని వివాహమాడి పదిహేనేండ్ల వైవాహిక జీవితంగడపి పదిరోజులనాడే వైధవ్యాన్ని పొందానన్నాడాయన.

"మొగవాళ్ళకేమి వైధవ్యమండీ"అన్నదినవనీతం.

కాలం మారిపోయింది, కాబట్టి సాంఘికవిలువలు కూడ మారవలెను. మారి తీరుతాయి, ఈ రోజు కాకున్నా రేపైనా,"అన్నాడు కట్టెవిరిచినట్లు శాస్త్రి.

శాస్త్రిగారు తనచిన్ననాటి ప్రేమనుగూర్చి చెప్పలేదేమా? అని నవనీతం ఆశాభంగం పొందింది, ఆడవాళ్ళు ప్రేమకు మహత్వ మిచ్చినట్లు మొగవాళ్ళివ్వరనుకుంది. ఇంక విషయం మరచిపోవడం మంచిదని నిశ్చయించుకుంది,

"గంటైనదండీ, పనుందని నవనీతం లేచింది, నమస్కారం ధన్యవాదం తెలియజేసి శివరామశాస్త్రి వెళ్ళాడు. అతని హృదయంలోను కల్లోలమే. హృదయ మొక చీకటి గుహాగా ఉన్నది, మరల దానిలో నవనీతం ప్రవేశిస్తే... మళ్ళా ఆశ .... అందనిమ్రాని పండ్లకాశించగూడదనిపించింది, ఏలాగు అంత పెద- స్కూలు స్వంతదారిణితో చిన్న

నాటి ప్రేమ కలాపాలు నెమరువేయమనడం? ఇన్ని మార్పులు వచ్చిన ఆమె జీవితంలో తనకేమి స్థాన ముంటుంది? అని సంకోచించినా రేయింబవళ్లిదే ఊహ- ఎలాగైనా అవకాశం కలిగినప్పుడామె నారాయణేనా అన్నది తేల్చుకోవాలన్న కోర్కె అతనికి నానాటికి ప్రబలంకాసాగింది. పైగా పిల్లలిద్దఱు హాస్టలులో ఉంటూ ఉండడం వల్ల హోటల్లో తిండి. ఆఫీసు పని, ఆయనుకు కూడ జీతమర్ధరవిహితంగా ఉన్నది, ఏదో డబ్బున్నది పిల్లలుపైకి రావడానికి బాధ ఉండదు, ఆత్మహత్య చేసుకున్నా మేలని పిస్తుంది ఒక్కొక్కప్పుడు- శాస్త్రికి,

ఒకనాడు ధైర్యం చేసి తన హృదయభావాలన్నీ విశ్లేషిస్తూ తాను ఇంజనీరన్న ధోరణిలో కాక చిన్ననాటి బాలకవి ధోరణిలో "హృదయార్పణం" అని పేరుపెట్టి ఒక కధ వ్రాసి నవనీతంగారికి పంపాడు. కథ సుఖాంతం నాయికానాయకులు జీవితాలలో ఎన్ని మలుపులు తిరిగినా మళ్లా ఏకోన్ముఖంగా కలిసిన సెలయేళ్లలాగా ఆనందంతో కలిసిపోయారు- మర్నాడే జవాబు వచ్చింది, కథలో సులభంగా నెరవేరింది అలాంటి ముగింపు, జీవితంలో సాధ్యమా, ఆచరణయోగ్యమా అని ప్రశ్నించబడినది. తర్వాత శివరామ శాస్త్రిగారు ఏమి వ్రాశారో తెలియదు,

శివరామ శాస్త్రిగారు తుంగభద్రా ప్రాజెక్టుకు మార్చుకున్నారు. ఎక్కడో దక్షిణాది నుంచి చదువుకున్న భార్యను తెచ్చుకున్నాడని తోటివారనుకుంటున్నారు.

నీలగిరి పబ్లిక్‌స్కూలు హెడ్‌మిస్ట్రెస్ నవనీతం డేవిడ్ కొండమీద నుంచి జారి అఘాతపు లోతుల్లో పడి మరణించినదనీ, నవనీతం డేవిడ్‌లపేర ఒకట్రస్టు ఏర్పరచి ఆ ఎస్టేటంతా మానేజి చేయవలసినట్లు, ఆమె గదిలో ఉత్తరము దొరికిందని- స్కూలు అభివృద్ధి కావడమే తన కోర్కెఅనీ తాను ఆత్మహత్య చేసుకోబోతునట్లు- కారణం జీవితం మీది విసుగేనని కూడ ఆ ఉత్తరం వ్యక్తం చేసిందని పత్రికలలో ప్రకటింపబడినది-

నళినికి రఘుకు తండ్రి శివరామశాస్త్రిగారు "ఇంట్లో ఇప్పుడు "అమ్మ" ఉన్నదని పై సంవత్సరం ఆంధ్రలోనే చదువు సాగించవచ్చ"ని వ్రాసారు.

సెలవుల్లో ఇంటికి వచ్చిన రఘు నళినితో అన్నాడు "అక్కా ! ఈవిడ హెడ్‌మిస్ట్రెస్ కదూ!" అని రహస్యంగా,

"ఫూల్ "హెడ్‌మిస్ట్రెస్ చచ్చిపోతే- ఈవిడను నాన్న మళ్లా పెండ్లాడారు మనఅమ్మ చనిపోయింది కాబట్టి" అన్నద నళిని కండ్లలో నీళ్లు నిండగా.

అవతలినుండి ఈ మాటలు వింటూన్న నవనీతం- లేదమ్మా నాపేరూ కమలమ్మే, మీ అమ్మ చనిపోలేదు" హెడ్‌మిస్ట్రెస్ చనిపోయింది, నేను మీ అమ్మనే, అంటూ పిల్లలను దగ్గరికి తీసికొంది,

రఘు అమ్మా, అమ్మ అంటూ నవనీతం మెడను తన చేతులతో చుట్టేశాడు, ఎన్నడూ పొందని అనుభూతి నవనీతానికాక్షణం కలిగింది.

"ఇంజనీరుగారి రెండో భార్యట- చూడు పిల్లల నెలా చూచుకుంటూందో" అని అమ్మలక్కలు విస్తుపోయారు.



# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తి కలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు!



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఆంధ్రా మెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము. |
| మహిళా మందిరము | : విద్యార్థినులకు వసతి గృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాఖ—అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్సుఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణకూడ యివ్వబడుచున్నది |
| ఆర్థోపీడిక్ సెంటర్ | : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమకేంద్రం. |
| ముద్రణాలయము | : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్క్సు చేయబడును. |
| నాగేశ్వర శిశువిహార్ | : పిల్లల విద్యావినోద కేంద్రం. ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది |
| అర్బన్ వెల్ఫేరుప్రాజెక్టు | : కపాలి తోట్టంలోను నారాయణస్వామి గార్డెన్‌లోను బీదలకు సంక్షేమ కార్యక్రమముల నిర్వహింపబడుతోంది |
| వనితా బాలవిహార్ | : స్త్రీలకు, పిల్లలకు- పార్కు, ఆటస్థలం. |
| రీజియనల్ హాండీక్రాఫ్ట్సుయిన్స్టిట్యూట్ | : ఆంధ్రమహిళాసభ, హైదరాబాదుబ్రాంచిచే నడుపబడుచున్న చేతిపనుల శిక్షణాలయము |